## శ్రీమద్రామాయణ

# కల్పతరువు

(బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండలు)



గ్రంథకర్త:

'పౌరాణిక శేఖర' 'పౌరాణిక రత్న'

'కవిరత్న', 'ఆగమాచార్య'

**శ్రీమాన్ పరాంకుశం వేంకట శేషాచార్యులు**

పేర్నమిట్ట, ప్రకాశం జిల్లా.

ప్రథమముద్రణ : 1000 కాపీలు

ప్రజాపతినామ సంవత్సర మార్గశిరమాసము.

"పౌరాణిక శేఖర! నీ
సారస్వతసేవ భక్తజన సేవ్యమ్మై
శ్రీ రుచిర రామచంద్రుని
సార కృపా బలముచే ప్రశస్తిన్ గాంచున్

—'మధురకవి'
కీ॥ శే॥ బృందావనం రంగాచార్యులు



'సమత' ప్రింటర్స్
ఎ జి. కాలేజి రోడ్,
బాపట్ల.
ఫోన్ : 4296

వెల రూ. : 20/-

# శ్రీ విఖనస మహాగురవే నమః



నిరుపమ గుణపూరమ్, నిత్యసత్యప్రచారమ్ నతజనఘనివారమ్, ఘోచితార్థ సారమ్
కలుషనగ మహేంద్రమ్, కామితార్థైక కేంద్రమ్ విఖనసమునిచంద్రమ్, దివ్యభావాభిసాం[illegible]

శ్రీ రామ

శ్రీ విఖనస మహాగురవేనమః

# మున్నుడి

(పూజ్య జననీజనకులు, కీర్తిశేషులు,

| | |
|---|---|
| శ్రీమాన్ పరాంకుశం రంగాచార్యులు<br>శ్రీమతి అనంతలక్షమ్మగార్లకు | శత ప్రణతు లర్పించుకొనుచు |



శ్రీరామ చంద్రుడు నాకు ఆరాధ్య దైవం. ఊహ తెలిసి నప్పటినుండి ఆ సీతారామచంద్రస్వామి చరణ సంసేవనానికి నా జీవితాన్ని అంకితం చేసుకున్నాను. నేను మొదట పురాణ ప్రవచ నానికే ప్రాధాన్య మివ్వటంవల్ల, కవితావ్యాసంగం కొంత ఆల స్యంగా మొదలు పెట్టాను. అయితే ఎప్పటికైనా శ్రీరామచంద్రుని దివ్యగాథను కావ్యరూపంగా భక్తజనులకు అందించాలన్నది నా చిర కాలవాంఛ. ఈ ఆశయానికి సరైన సమయంలో ప్రేరణనిచ్చి కావ్య రచనకు ప్రోత్సహించినవాడు నా మేనల్లుడు, "మధురకవి" కీ|శే| బృందావనం రంగాచార్యులు - అతని సహకారంతోనే ఈ కావ్యం ఈనాడు అక్షర రూపాన్ని సంతరించుకుంది.

ఈ సందర్భంగా నాకు వైదిక, ఆగమ, కావ్య పరిచయాలను కల్గించినవారిని స్మరించుకోవటం, నా విధ్యుక్త ధర్మం. ఓనమాలు దిద్దబెట్టి, అక్షరజ్ఞానాన్ని కల్గించిన ప్రథమ గురువు కీ|శే| శ్రీ వారణాసి పాపయ్య పంతులుగారు (పేర్నమిట్ట). అనంతర కాలంలో ఆగమ శాస్త్ర విధానాన్ని క్షుణ్ణంగా నేర్పించినవారు పూజ్యులు కీ|శే| శ్రీమాన్ పెద్దింటి వేంకటాచార్యులుగారు (యనమదల). అపౌరు షేయాలైన వేదాలను ఆసక్తితో అధ్యయనం చేయించినవారు

బ్రహ్మశ్రీ కీ|| శే|| శ్రీ ఓగిరాల వీరరాఘవశర్మగారు (ధేనువకొండ) జన్మతః నాలో కలిగిన పురాణ ప్రవచనాసక్తిని గమనించి, నన్ను 'పౌరాణికరత్న'గా తీర్చిదిద్దినవారు నా మేనమామ కీ|| శే|| శ్రీమాన్ పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు (యనమదల)-నా పెద్దతండ్రి కీ|| శే|| పరాంకుశం కేశవాచార్యులుగారు ప్రథమ గురువుగా వేదవిద్య ప్రారంభించినవారు. వీరందరికీ నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

పురాణ ప్రవచనం ముమ్మరంగా జరుగుతున్న రోజుల్లో నాలో కవిత్వం వ్రాయాలనే కోరిక మొగ్గతొడిగింది. కావ్యరచనకు కావలసిన ఛందస్సును నేర్చుకోవటానికి ఉద్యుక్తుడనైనప్పుడు, నన్ను అభిమానంతో ప్రోత్సహించి ఛందస్సులోని వివిధరీతులను, మెళుకువలను సాంగోపాంగముగా వివరించినవారు పెదకొత్తపల్లి వాస్తవ్యులు, నా మిత్రులు శ్రీ ఇంకొల్లు శ్రీరామ బ్రహ్మంగారు. ఛందస్సును నేర్పినప్పటినుండి నాచేత కావ్యరచన చేయించాలన్నది ఆయన పట్టుదల. ఆయన అభీష్టానికనుగుణంగా మొదటగా నేను వ్రాసిన కావ్యం శ్రీలక్ష్మీ చెన్నకేశవ స్తుతి. ఈ శతకం పండితుల ఆశీస్సుల్ని అందుకుంది.

చిన్నచిన్న ఖండకావ్యాలు వ్రాస్తున్న సమయంలో నా మేనల్లుడు కీ|| శే|| బృందావనం రంగాచార్యులు - "మామయ్యా! యీ చిట్టిపొట్టి కావ్యాలు వ్రాయటంకంటే, నీ ఆరాధ్య దైవమైన సీతారామ చంద్రస్వామి దివ్యకథను ఒక భవ్యకావ్యంగా వ్రాయకూడదూ?" అని ప్రేరేపించాడు. ఏ శుభముహూర్తంలో నా మేనల్లుడు ఆ స్పందన కల్గించాడోగానీ అది యీనాడు ఈ 'శ్రీమద్రామాయణ కల్పతరువు'గా ఆవిర్భవించింది. ఇందులో బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండలను మొదటి భాగంగా ముద్రించాను. సుందర, యుద్ధ కాండలతో రెండవ భాగం త్వరలోనే శ్రీరామ కృపాకటాక్షంతో మీకు అందించగలనని ఆశిస్తున్నాను. ఈ కావ్య

రచనకు రామానుగ్రహమే ప్రధాన కారణముగానీ, నా అల్పజ్ఞా
నము, పాండిత్యము కాదు.

ఈ కావ్యాన్ని అచ్చువేయటానికి సహకరించిన సహృదయు
లెందరో ఉన్నారు. ప్రధానంగా నాపై ఉన్న ఆదరాభిమానాలతో
అన్ని విధాలా నాకు సహకరించిన

నా సోదరుడు

**శ్రీమాన్ పరాంకుశం హనుమాచార్యులకు,**

నా కుమారుడు

**చిరంజీవి డా॥ సత్యనారాయణాచార్యులకు,**

(మున్సిపల్ మెడికల్ ఆఫీసర్ ఒంగోలు)

నామీాది ప్రేమాతిశయంతో కావ్యముద్రణ సమయంలో నాకు
చేదోడుగా నిలచిన నా కుమార్తె

**చి॥ ల॥ సౌ॥ లక్ష్మీ నాయకమ్మకు,**

నా అల్లుడు

**డా॥ యన్. కేశవమూర్తి (ఎం.బి బి.యస్.) కు,**

నా శుభాభినందనలు.

ముఖ్యంగా ఈ కావ్యరూపాన్ని తీర్చిదిద్దిన

**"మధురకవి" బృందావనం రంగాచార్యులకు,**

ఆత్మీయతతో ఆర్థిక సహకారాన్ని అందించిన

**పేర్నమిట్ట, నర్సాయపాలెం, అప్పాపురం గ్రామ**

**భక్త మహాశయులకు,**

**నిజామాబాదు విద్యుత్ బోర్డు శాఖవారికి,**

అడిగిన వెంటనే తమ అభిప్రాయాలను పంపించి నా కవితా
వ్యాసంగాన్ని పరిశీలించి, ప్రశంసించిన

**విద్వత్కవిశేఖరులకు**

అచ్చువేసే కార్యక్రమంలో అండగా నిల్చిన
బాపట్ల 'కళాభారతి' కార్యదర్శి
**డా॥ కె. వి. యస్. ఆచార్యగారికి,**

సకాలంలో అందంగా అచ్చువేసి అందించిన 'సమతా' ప్రింటర్స్
**శ్రీ గోపాళం రాధాకృష్ణమూర్తి గారికి,**

నా ధన్యవాదములు.

రామునికి తోడుగా నిల్చిన ఆదిశేషుని (లక్ష్మణుని)లాగా, రామ
కార్యానికి తోడైన నా మేనల్లుడు
చిరంజీవి **నారాయణం** శేషుబాబుకు,

ఆశీస్సులు.

నీరక్షీర వివేచనా పరిజ్ఞానంగల బుధవరేణ్యులు ఈ కావ్యంలోని దొస
గులను మన్నించి, సొగసులను ఆస్వాదిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

పేర్నమిట్ట
21-12-91

భక్తజన విధేయుడు,
**పరాంకుశం వేంకట శేషాచార్యులు**



# ఆకాంక్ష

'శ్రీరామ్ చరణ్'
(పండిత కుందుర్తి వేంకట నరసయ్య పాకయాజి)

శ్రీమాన్ పరాంకుశం వేంకట శేషాచార్యులు 'పౌరాణిక శేఖర' 'పౌరాణిక రత్న' బిరుదాంకితులు. వీరు రామాయణాది మహా గ్రంథములను అద్భుతముగా ప్రవచించెదరు. గాత్ర సౌలభ్యము, పురాణమునకు తగిన సంగీతము. విషయ వివరణాశక్తి, జనరంజకత్వము వీరిలో విశేషముగనుండి వీరు రేడియోలోను ప్రవచించుట జరిగినది. పురాణానుభవముతో గలిగిన విజ్ఞానముతో, లోకమునను గ్రహించుటకై, దివ్యమగు రామకథను తీసుకుని వీరు తేట గీతులలో రసవత్తరముగ 'శ్రీ మద్రామాయణ కల్పతరువు' ను రచించినారు. ఇది పండిత, పామర రంజకముగా వున్నదనుటలో ఏ మాత్రము సందేహము లేదు. వీరు స్వాభావికముగా రామభక్తులు. అట్టి వీరి గ్రంథమును సమస్త లోకము సమాదరించుననుటలో సందేహము లేదు. ఈ గ్రంథమునేగాక యింక నిట్టి సద్గ్రంథములను రచించి లోకోపకారము చేయగలరని మా ఆశ. ఇది నిజముగా కల్పతరువే!

శ్రీరామ్ శరణ్
బుద్దాం
కర్లపాలెం (మండలం)

# శ్రీ సూక్తము

రచన శ్రీ
డాక్టర్ జంధ్యాల పాపయ్యశాస్త్రి
ప్రధానసంపాదకులు
పోతన భాగవతం ప్రాజెక్టు
(తిరుమల తిరుపతి దేవస్థానములు)
గుంటూరు

సామాన్యులకై "శ్రీమ
ద్రామాయణ కల్పతరువు" రచియించిన మీ
సామర్థ్య మసామాన్యము
క్షేమప్రద మార్యవర్య! శేషాచార్యా!

అందములై నవరస ని
ష్యందములగు తేటగీతి ఛందమ్ముల ని
ట్లందర మెప్పించిన మీ
చందమ్ములు భక్తహృదయ సంస్పందమ్ముల్!

చూచితి! మెచ్చితి! మీ వా
చా చతురతకున్; పరాంకుశం వేంకట శే
షాచార్యవర్య! మీ కృతి
యాచంద్రార్కము ధరిత్రి నలరుంగాతన్!!

వందలమంది కవీశ్వరు
లెందరు వ్రాసినను తరుగ దించుకయును తత్
సౌందర్యము; రామకథా
మందార మరంద మధురిమం బెంతటిదో!

సురుచిర "పౌరాణిక శే
ఖర! శేషాచార్య! సరసకవితాధుర్యా!
పరమ కృతార్థుఁడ వార్యా!
పరాంకుశం వంశగగన భాస్వరసూర్యా!

ఇతి శివమ్

# కవితా స్రవంతి

కవిమిత్ర - కవితా విశారద
**లేళ్ళ వేంకట రామారావు**
బాపట్ల

ఎందరో మున్ను వ్రాసిరి జపించిరి రాముని గాథలల్లుచున్
కొందలమందు డెందములఁ గోర్కులు తీర్చుకొనంగ, శాంతమున్
బొందిరి నిర్వహించి తగు భోగములొప్పఁగ రాజ్యమేలి రా
నంద సుఖైక్యతల్ గదుర నాటికి నేటికి రాము సేవలన్!

ముక్తికి తావలంబమయి మోదముఁ గూర్చెడి రాము గాథలన్
భక్తికిఁ జోటుగల్గు నిజభావముఁ జూపి రచింపఁగల్గితే
శక్తికిఁ జాలరెవ్వరును సజ్జన శేఖర! కీర్తిధామ మా
సక్తిని గట్టికొంటివి విదిచాలును జన్మ తరింప నేర్వఁగన్!

గడుసరి కైతకూర్పులకుఁ గాలము చెల్లఁగ నెంచ కెంతయున్
దోడవును గూర్చునంచు రఘుధూర్వహు రాముని గాథ బల్కి నీ
నడవిక కెంత కూర్చితివి నాడెముదప్పని మేలిబాట; బల్
సడలని కీర్తిచంద్రికల సంపదఁ బేర్చితి విందునందునన్!

జంకును గొంకులేక పదచాతురిఁ బాటవ శక్తియుక్తులన్
బొంకము బింకముల్ గలిఁగి పోడిమి గాంచఁగ వ్రాసితీవు ప
ద్యాంకిత శైలికబ్బురపు టందముఁ గూర్చి రసంబు చిప్పిలన్
అంకుశ భావమొల్లని పరాఁకుశ వేంకట శేషమార్యుఁడా!

నీ కవితాస్రవంతికి వినిశ్చల భావతరంగ పాళికిన్
నీ కమనీయ పాండితి వినిర్మిత భక్తి విధాన సేవకున్
శ్రీకర మొప్పఁగల్గి తగు సేవలుదిద్దిన భాగ్యమూర్తి! నీ
వాకున జాను తెన్గు రసవాకలు దూకుచుఁ గావ్యమబ్బెరా!

అందలమెక్కు భాగ్యమున కందదు, సోమరసంపు పూర్ణతన్
జెందదు, కామితార్థములచేత గడింపదు, నీయమంద కా
ళిందిఝరీ ప్రవాహమయ లేఖిని వ్రాసిన కావ్యసృష్టికిన్
బొందిన హర్షమేమని ప్రపూర్ణ మనస్కుఁడనై వచించెదన్!

నీ కవితా ప్రరోహమొక నిండువెలుంగు విధాననాంధ్రికిన్
సోకిన రామమంత్రమయి, సోదరవత్సలతా విశిష్టమై,
ప్రాకిన రామరాజ్యమయి పాదుకొనంగ, విశాల భావముల్
సాకిన గ్రంథరాజమయి సత్ఫల మిచ్చునుగాత నెప్పుడున్!

తీయతీయని సైకత తేటతెలుంగును
ముద్దాడి భావముల్ మొలకలెత్త
లోకోక్తులనుగూడి లోఁగిన శబ్దము
లొకదాని పిలుఁదున నొకటి పర్వఁ

దూచి యిచ్చిన రీతిఁ దోడనే యర్థముల్
గుమిగూడి లోలోనఁగూడి కోశఁగఁ
బాక బలమ్మునఁ బలుఁగిడు పంక్తులు
శయ్యా విలాసమ్ము సంతరింప

సహజ సిద్ధమై వచ్చిన చదువులమ్మ
నిత్యయౌవన భూషల నిలిచియాఁడఁ
కూర్చి పేర్చితి నీ కావ్య గుణమునందు
రామచరితామృత మథనరాయ వర్య!

# ఆప్తవాక్యమ్!

'ప్రవచనాచార్య', 'కవిశేఖర'
'ఉభయ భాషా ప్రవీణ'
'రామాయణ కథా సుధానిధి'
**శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు**

"కూజన్తమ్ రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్."

"వాల్మీకి గిరి సంభూతా రామసాగర గామినీ, పునాతి భువనం పుణ్యా, రామాయణ మహానదీ". ఈ శ్రీమద్రామాయణ మహాపుణ్య కథా వాహిని ఎన్ని లక్షల యేండ్లుగా ఈ భువనమును పవిత్రము చేసినదో? చేయనున్నదో? ఒక్కొక్క తరమునందు ఒక్కొక్కడు రామాయణమును నిందించినచో ఆదేశ భాషలలో ఎన్ని రామాయణములు పుట్టునో? ఆరామాయణ లక్షణమట్టిది. ఆవాల్మీకి మహర్షి చేసిన తపస్సే అట్టిది. కాబట్టియే వేదములను విభాగించి మహాభారత గ్రంథమును దేశమునకందించి బ్రహ్మసూత్ర కర్తయైన వేదవ్యాసుడు కూడా వాల్మీకినే ప్రమాణించటం జరిగింది.

లోకంలో సంస్కృతంలోనే ఎన్నో రామాయణములు పుట్టినయ్. కానీ ఆరామాయణాల కన్నింటికీ అపూర్వ గౌరవం మాత్రం లేదు. శ్రీరామునకు ప్రాణాధిక ప్రీతి మాత్రమే కాకుండా పరమ గౌరవ స్థానం కూడా అయిన వాల్మీకం సత్యసూక్తినిధి అని నిరూ

పించుకుంది. మిగిలిన రామాయణాలు, వాటికి వాటికి తోచిన వింత వింత కథలనల్లుకొన్నయ్. వాల్మీకి ప్రత్యేకత ఏమిటీ? అంటే దీనికి చతుర్ముఖ బ్రహ్మ వచ్చి స్వయంగా "నీ రామాయణంలో ఎక్కడా అబద్ధమనేది ఉండదు. అంతా సత్యమే", అని చేసిన మంగళ శాసనం ఉంది. మిగిలిన రామాయణాల్లో ఈ అంశం ఉన్నట్లు నాకంటికి కనపడ లేదు. చెవికి వినపడనూలేదు. తెలుగులో ఎన్ని రామాయణాలు పుట్టి నయ్యో చెప్పలేము. కేవలం తేటగీతులలోనే వ్రాసిన కవులు నలుగు రైదుగురు పైగా నే నెరిగినవారున్నారు. సరే.

ఈ రామాయణ కల్పతరువు పేరులో ఉన్న తీరును బట్టి విశ్వ నాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షాన్ని జ్ఞాపకం చేస్తుంది అంతేకాని ఇంక ఏఅంశంలోనూ దీనికి దానికీ సంబంధము లేదు. వీరు కేవలం వాల్మీకినే కాకుండా ఇంకా ఎన్నో రామాయణాలు చదివినట్లుగా తోస్తున్నది. కౌసల్యా దశరథుల వివాహ విషయం వీరు ప్రథమంగా ఉటంకించారు. ఇది వాల్మీకంలో నా చూచిన మేరకు తోచలేదు. దీనివలన ఈ కల్పతరువునకు వచ్చిన ప్రత్యేక బలమేమో నాకు తెలియలేదు. అయితే ఇది యిలాగే రాయాలి అని కవికి ఆంక్ష లేదు గాబట్టి, కవి స్వతంత్రుడు కాబట్టి, ఏవైనా కల్పనలు చేయ వచ్చు. వెనకటి కవులు చాలమంది ఇలా కల్పనలుచేసి కథలు పెంచిన వారే. కాబట్టి వీరు ఆరంభంలోనే కౌసల్యాదశరథుల వివాహ వృత్తాంతాన్ని వర్ణించారు.

ఈ వేంకట శేషాచార్యులుగారు కవి కానప్పుడు నాకు పరి చితుడు. అనగా ఈకావ్యం వ్రాయనప్పుడు, వ్రాద్దామనే ఊహ కూడ లేనప్పుడు. గొప్ప రామభక్తుడు. కేవలం తేటగీతిని ఎన్నుకొని చెప్పటంలో ఒక విశేషం మాత్రం ఉంది. రామాయణ కవిత్వ వాహిని తేటతేరి కమ్మని సంగీతము వలెనే ఉంటుంది. అసలు రామాయణ ధర్మమే "పాఠ్యే గేయేచ మధురమ్" అని కదా వాల్మీకి శ్రీసూక్తి.

రామాయణం అంటే మహా శరణాగతి అంతకంటే మోక్షా న్నిచ్చేది లేదు. "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అని కదా మనము మన ధర్మాన్ని స్వామి సన్నిధిలో విజ్ఞాపనం చేస్తు న్నాం. మిగిలిన రామాయణాలలో ఈ శేషత్వం లేదు. దాసత్వం కూడ లేదు. దాసధర్మం, భృత్యధర్మం అని రెండు ధర్మాలు ఉన్నాయి ఈరెండింటికి అర్థంలో తేడా ఉంది భృత్యుడు అంటే భృతిచేత అనగా జీతముచేత సేవ చేస్తుండేవాడు. అంటే ప్రతిఫలా పేక్షి అని అర్థం. దాసుడంటే ఏమాత్రం ప్రతిఫలాన్ని కోరకుండగా ఆత్మ ధర్మంగా సేవ చేస్తుండే వాడు. ఆ సేవ ఎలాంటిదైనా సరే! అటువంటివాడు "దాఽసోహం కోసలేంద్రస్య రామస్యాఽక్లిష్ట కర్మణః" అని భావిస్తాడు ఇది ఆంజనేయుని సూక్తి.

ప్రకృతం ఆచార్యులగారి వాక్కు సులభంగా, సుందరంగా ఉంటుంది. తాను చెప్పదల్చుకున్న భావాన్ని సూటిగా చెప్పే నిష్కపటి కూడాను. శ్రీరాముడు శివధనుస్సును విరిచాడు. ఆ ధ్వనికి ఆ సభలో జనకుడు విశ్వామిత్రుడు తప్ప అందరూ కూడా భయపడిన వారే, మూర్ఛమునిగిన వారే. ఈభావాన్ని ఎంత సుఖంగా, ఛంద స్సులో ఒదిగించారో చిత్తగించండి.

రాజు జనకుండు మరి మునిరాజు దప్ప
కడమ వారెల్లరున్ భయపడిన వారె.
మూర్ఛ చెందిన వారె సమ్మోహితులయి
తెప్పరిల్లని వారలె చెప్పనేల

ఇంత చక్కగా చెప్పగలరు. ఇట్లే

"భూమిపై కురియించిరి పూలవాన
దేవతలు దివి నుండియు దీప్తి గదుర

దుందుభులు మోగ్రిగె ప్రివిమలానందలీల
అప్సరస లాడినార నాహ్లాదముగను"

ఇట్టి పద్యాలు ఎన్నో ఉన్నవి.

ఈ **ఆచార్యుల** వారికి ఉన్న బిరుదుల్ని బట్టి పురాణ విజ్ఞానం బాగా ఉన్నట్లుగా తోస్తున్నది. అది సామాన్యమైన విషయం కాదు. కానీ పురాణాంతర కథల్ని సమకూర్చేటప్పుడు, గ్రంథానికి ఎంత వరకు ప్రయోజనము అనే విషయాన్ని ఆలోచించాలి. ఆ చూపులేక పోతే కొంచెం యిబ్బంది వస్తుంది. నిర్మలమైన మనస్సు, నిశ్చలమైన భక్తి, నిరంతర గ్రంథావలోకనము, కల్గిన శ్రీమాన్ ఆచార్యులవారు రామాయణం వ్రాశారంటే నాకెంతో సంతోషం. నేను వాల్మీకి రామాయణ ప్రేమిని కాబట్టి ఏదో వ్రాశాను. ఇది అందరికీ నచ్చదు. ఆచార్యులుగారి పద్యరచనాశైలి చాల హాయిగా ఉంది. వారి శైలి మాత్రం రామాయణ శైలియే. వారికి నాదాసోహములు. సెలవు.

దాసుడు,

**కోగంటి సీతారామాచార్యులు.**



శ్రీమాన్ 'కవి శేఖర' పౌరాణికరత్న, ఆగమాచార్య
వైద్య విద్వాన్ ఇత్యాది బిరుదాంకితులు
శ్రీమాన్ పరాంకుశం వేంకట శేషాచార్యులవారి
"శ్రీమద్రామాయణ కల్పతరువు" నాకు

# గీత కావ్యాశంసనం

'కవితా కళానిధి' 'ఆంధ్ర విశారద'
'విద్వత్కవి శిఖామణి'
శ్రీ పొత్తూరి వీరరాఘవ ప్రసాదరాయశర్మ
B. O. L.

వర పరాంకుశ నామంబు వరలినట్టి
మీరు పౌరుష నామంబు మిన్నయనగ
కవిత యందున నేరుపు గానుపింప
సార తర రసము చిప్పిల సరళ భాష

రాము చరితగూర్చి రమ్యంబు తోడుత
సార భూతమైన సత్వమునను
దివ్య యశముఁగొనియు కావ్యగానము సల్పి
పేరుగొంటి గావె ధీరలలిత!

రామాయణ మదిమిన్నయ
ధీ మాన్యుల కగునుగాదె దివ్యత గూర్పన్
క్షేమాభి రామయుతముగ
రామచంద్ర విభుడు ప్రోచురమ్యత మిమ్మున్

ఎంతమంది కవులు సంతస మొప్పగ
రాము చరితజెప్పి రాణగనిరి
ప్రకటమైనయట్టి పరమార్థ తత్వంబు
మోక్షసిద్ధి నొసంగ ముదముఁ గనుము

చక్కని కవనము నేర్చియు
నెక్కటి రఘురాము చరిత నెంతయు వెలయన్
మిక్కిలి ప్రేమను గూర్చితి
నిక్కముగను మీదు జన్మ నిరుపమము గదా!

పౌరాణిక కవిశేఖర!
పౌరాణిక రత్నమైన పాండిత్య కవీ!
సార తర కవిత నెరపిన
సూరి జననుత ప్రభాన శుభగుణశీలా!

వేంకట శేషాచార్యా!
సంకట హరు రాము చరిత సాహిత్యమునన్
వేంకట నగమున భాసిలు
వేంకటపతి దయను వెలయు విజ్ఞులు మెచ్చన్!

తేటగీతుల తోడుత దివ్యముగను
రాము చరితంబు గూర్చిన రమ్యమతివి
నీదు చరితంబు ధన్యంబు నిక్కువముగ
శ్రీద గుణ ధుర్య వేంకట శేషవర్య!

శ్రీ వత్సాంకిత వక్షుడు
భావజగురు డద్వితీయ భవమోచకుడున్
భావం బొప్పగ బ్రోచుత
శ్రీ వరుడౌ రామచంద్ర చిన్మయ ప్రభుడున్

హా॥ వీరరాఘవ వరప్రసాదరాయశర్మ
సంతమాగులూరు

## ప్రణతి

'మధురకవి' 'సభా సమ్రాట్'
డా॥ కె. వి. యస్. ఆచార్య
హిందీ శాఖాధిపతి, ఆర్ట్స్ కళాశాల
కార్యదర్శి 'కళాభారతి', బాపట్ల.

శ్రీకరమై విలసిల్లే
సీతారాముల గాథను
తెనుగు తేట గీతులలో
దివ్య పద్య కావ్యముగను
భక్త జనుల కందించిన
'పండిత శేషాచార్యులు'
విమల భావ బంధురమై
వెలయు సుకవితా ధుర్యులు!

పులకింతలు కలిగించే
లలితమైన కల్పనలకు-
రసహృదయుల మెప్పించే
రమ్యకావ్య శిల్పమునకు
తావలమైనది "శ్రీమ
ద్రామాయణ కల్పతరువు"
అందరికీ కావ్య రసా
నందమునకు మేలి తెరువు!

సుకృతాత్ములు, రససిద్ధులు
సుకవీశ్వరులే ధన్యులు!
శాశ్వతమగు కీర్తితోడ
సమ్మానితులగు మాన్యులు!

వారికెపుడు సమర్పించు
వందనములు సకల జగతి!
ఆ కోవకు చెందిన శ్రీ
ఆచార్యుల కిదే ప్రణతి!

# ప్రశంస

గీతాప్రచారక
కోటంరాజు సత్యనారాయణశర్మ
బాపట్ల

శ్రీమద్రామాయణ కల్పతరువు, తెలుగు నుడికారమున సొంపు దిద్దిన తేటగీతి కావ్యము. కవి శ్రీమాన్ వేంకట శేషాచార్యులు గారు, పౌరాణికులుగా శ్రీరామ కథామృతమును సేవించిన వహనీయులు.

"రాఘవేశ్వరు చారిత్రము యెవ్వరెన్ని గతులన్ వర్ణించినన్ చాలదే" అన్నారు కంకంటి పాపరాజు, ఉత్తర రామాయణ కావ్యంలో. శ్రీరాముడెంత సుందరుడో, వాల్మీకి కావ్య సంపద అంత మనోహరము. శ్రీరామచంద్ర ప్రసాద లబ్ధ మధుర కవితా రసామృత హృదయుడగు శ్రీశేషాచార్యులు గారు ధన్యజీవి. శ్రీరాముడు ప్రభువు. ఇతరులకు యిచ్చేవాడే కాని పుచ్చుకొనే వాడు కాడు. మితభాషి మాత్రమే గాదు, "పూర్వభాషీ చ రాఘవః" అన్నారు వాల్మీకిమహర్షి. ఎబ్బది వసంతాలు నిండిన యీ కవి శ్రీరామోపాసన ఫలితమే "కల్ప తరువు" కావ్యరసవాహినిగా ప్రవహించినది. ఎవరికి ఏమి యివ్వాలో శ్రీరామచంద్రునికి తెలుసు. అజరామరమైన లలిత మధురాక్షరధారా శుద్ధమైన శ్రీరామ కావ్యం పరాంకుశం వారి వంశ పావనోద్యానంలో వెలసిన కల్పవృక్షమై, భక్త జనాళికి ముంగొంగుబంగారమై విలసిల్ల గలదని ఆకాంక్షించు చున్నాను.

కోటంరాజు సత్యనారాయణ శర్మ
21. 12. 91.

# అభినందన మందారం

పూజ్యులు శ్రీమాన్ పరాంకుశం వేంకట శేషాచార్యులు గారు పౌరాణిక శేఖరులు - నిరంతర పురాణ ప్రవచన పునీత మనస్కులు. ఈ పరమ భాగవతోత్తముని సృష్టి శ్రీమద్రామాయణ కల్పతరువు. ఇది వీరి తపఃఫలం. ఇది వీరి చిరకాలవాంఛ. ఒక భక్త శిఖామణి—శ్రీ కైవల్య పదచింతనకు అనువైన అవలంబనం ఈ కల్పతరువు. కల్పతరువు కామితార్థ ప్రదాయిని. అందులోను శ్రీ మద్రామాయణ కల్పతరువు. రచయిత రామాయణానికి కల్పతరువు శబ్దాన్ని జోడించడంలోనే విశేషముంది. అనన్యభక్తితో ఆశ్రయిస్తే నిశ్శ్రేయసప్రాప్తి ఆ రామునివల్లనే కలుగుతుంది. భవహారమునకే భక్తుడు రామభద్రుని కీర్తించడం. పోతరాజు-గోపరాజు-త్యాగరాజు ఈ రామభక్తి సామ్రాజ్యము నేలి తరించిన తపోధనులే. పూజ్యులైన శ్రీ ఆచార్యులవారు కూడ ఈ భక్తకోటిలో గణింపదగిన మహనీయులే!

వేదవేద్యుడైన పరాత్పరుడే ధరణిపై దశరథాత్మజుడుగా జన్మించాడని, ఆ వేదమే ప్రాచేతసుని చేతిలో రామాయణ మహాకావ్యంగా అవతరించిందని ఆభాణకం. మధుమయ ఫణితిలో మార్గదర్శకుడైన మహర్షి వాల్మీకి శ్రీరామునిచే, 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అని చెప్పించినా మన దృష్టిఅంతా మాయామానుష విగ్రహుడనే కదా! ఈ భగన్మాయ వల్లనో, యేమో కాని ఈ కావ్యమునకు వచ్చిన జగద్విఖ్యాతికాని, అనువాదములుకాని మరొక గ్రంథమునకు లేదంటే అతిశయోక్తి కాదు. తెలుగులో ఈ రామాయణం ఎన్ని రూపాలలో అవతరించిందో చెప్పలేము. ఇక సంస్కృతంలో చంపూ కావ్యంగానేకాక దృశ్య కావ్యంగాతీర్చి మురిసిపోయిన మహాకవులెందరో? కాబట్టి నాటినుండి నేటిదాకా రామకథను స్మరించి, తరించిన వారెందరో ఉన్నారు.

ఇక మరల శ్రీ ఆచార్యులవారు రామాయణ కల్పతరువును అందిస్తున్నారు. "మఱల నిదేల రామాయణం" అన్నవారికి "తలచిన రామునే తలచెద నేనును, నా భక్తిరచనలు నావిగాన" అన్న విశ్వనాథ సమాధానమే శరణ్యం. ఈ ప్రపంచక మెల్లప్పుడు తిన్న అన్నమే తింటూ, చేసిన సంసారమే చేస్తూ - రుచిభేదాన్ని, అనుభూతి వైవిధ్యాన్ని, అనుభవిస్తున్నది కదా! అందువలన తలచిన రామునే తలచెద నేనును - నా భక్తిరచనలు నావిగాన" అంటారు. ప్రస్తుతం కల్పతరువుకూడ అదే దృష్టితో వ్రాయబడినదని తాత్పర్యము. అనగా కల్పతరువు భక్తిరస పరిపోషితమైనట్టిది. కాబట్టి - "అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పాన విశేషమత్త చిత్తము" నకు ఇక వేరే రసము - ధ్వని - అలంకారము మొదలగు వానితో పనిలేదు. కల్పతరుచ్ఛాయలో హాయిగా రామచింతన చేయుటయే కర్తవ్యము.

ఈ కల్పతరువునందు నాలుగు కాండలే కలవు. సరళ సుందరమైన భాషలో, తేటగీతిలో రచన అంతా సాగింది. వివిధ సన్నివేశాలను, సంభాషణలను ఆకర్షణీయంగా ఒకే ఛందంలో కూర్చడం రచయిత సామర్థ్యానికి నిదర్శనం. తేటగీతి, ఆటవెలది కందం - ఇవన్నీ ముక్తకరీతికి ఒదిగిపోయే ఛందోభేదాలు కానీ, తేటగీతివంటి పరిమిత ఛందంలో అపరిమిత రామకథను అమర్చడం అనన్యసామాన్య విషయంగా భావించదగును. సామాన్యంగా తెలుగు రామాయణాలలో అమూలక విషయాలు అనేకం చూడవచ్చు. అదే విధంగా ఈ కల్పతరువుకూడ కౌసల్యా పరిణయంతో ప్రారంభం కావడం గమనార్హం. ఇది అవాల్మీకం. మోక్ష ప్రదాతయైన శ్రీరాముడు - కౌసల్యా సుప్రజా- అనికదా పేర్కొనబడింది. అందువల్లనే కౌసల్యా పరిణయానికి ప్రాముఖ్యమిచ్చి కథా ప్రారంభం కావించారు. కథాక్రమంలో వాల్మీకాన్ని మూడువంతులు అనుసరించారు. సుప్రసిద్ధమైన శ్లోకాల అనువాదం రమణీయంగా సాగిన

పట్టులు కొన్ని గలవు. అరణ్యాగమన సందర్భంలో సుమిత్రి లక్ష్మణునితో -

రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యామటవీం విద్ధి
గచ్ఛతాత! యథా సుఖమ్!!

అని హితవు గలిపి పలుకుతుంది. ఇక ఈ శ్లోకాన్ని వీరు -

దశరథేశునిగా రాము దలచుమెపుడు
నన్నుగా దలచుమా సీత నెన్నడేని
అడవి నెప్పుడు భావింపుమా! అయోధ్య
యనుచు, సుఖముగ వెళ్ళిరమ్మయ్య! పుత్రి!!

అనే పద్యంలోనికి అనువదించిన తీరు హృదయంగమం అని చెప్ప పనిలేదు. ఇక్లే కిష్కింధ కాండలో సుగ్రీవుడు సీత ఆభరణములు చూపిన సందర్భంలో లక్ష్మణుడు -

నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభి వందనాత్ !!

అని పలికిన సందర్భం గమనార్హం. ఈ ఘట్టం లక్ష్మణుని వ్యక్తిత్వాని కెత్తిన దివ్యపతాకం. వాల్మీకి మహర్షి లక్ష్మణుని ఆదర్శప్రియుడైన తమ్మునిగా, మరదిగా తీర్చిదిద్దుటకే ఈ సన్నివేశాన్ని సృజించాడు. ఇటువంటి శ్లోకాన్ని (శ్రీ) ఆచార్యులవారు జారవిడక జాగరూకులై అనువదించిన తీరుచూడండి-

అసలెరుంగను వదిన కంఠాభరణము
నెరుగ కేయూరములు. నసలెరుగ కంక
ణముల, తెలిసినవీ నూపురములె నాకు
వందనము నిత్యమొనరించు వాడనగుట!!

అని స్వతంత్రానువాదం చేశారు. మూలంలోలేని కంఠాభరణ కంక ణాలు చేర్చారు. మూలంలో కుండలాలను విస్మరించారు. అయినా ఈ పద్యం చదివిన సహృదయుడు ఆ శ్లోకాన్ని స్మరించి తీరవలసినదే! కవి స్వతంత్రతను మెచ్చుకొనవలసిందే! ఇంకా ఈ ఘట్టంలో రచయిత భావచాలనం ప్రశంసనీయంగా తోస్తుంది. లక్ష్మణుని ఈ మాటలో భారతీయ సంస్కృతి - ధార్మిక జ్యోతి, వేదసంస్కారము వెల్లివిరిసి నదట. "ఇది పురాతన ధర్మము - ఇది పూజ్యగంగ-ఇది మహోజ్జ్వల సంస్కార పదము - కాన నరుల గుండెలో నాటు వైభవాంకుర మని చాటారు. మనిషిని మనిషిగా, మానవుని మాధవునిగా తీర్చి దిద్దటమే మహాకవుల లక్ష్యం. అందుకనే విశ్వశ్రేయస్సును కావ్యానికి ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్నారు. మన సంస్కృతి సంప్రదాయ ములను సందర్భాను సారంగా హృద్యంగా వెలిబుచ్చారు. జగద్ధితమైన ఈ సంప్రదాయాన్ని గమనించిన శ్రీఆచార్యులవారు ఎంతైనా ప్రశంస నీయులు. పౌరాణిక శేఖరులు గనుక పురాణ ప్రవచనంలో నైతికమైన ఈ విలువలను గూర్చి వీనులవిందు చేయుడమే గాక గ్రంథస్థం కావించడంకూడ మెచ్చుకొనదగినదే! సంభాషణాత్మక శైలిలో వీరు సిద్ధహస్తులు. ఉదాహరణలు ఇస్తే ఎన్నైనా ఇవ్వవచ్చు. కాని పీఠిక గహనవాటిక కారాదు.

ఇక్ష్వాకు కులతిలకుని కథను ఇక్షురసంగా, కల్పద్రుమంగా మనకు (శ్రీ) ఆచార్యులవారు అందించారు. కనుక ఆస్వాదిస్తూ, ఆనం దిస్తూ ఉండటమే రసజ్ఞుల కర్తవ్యం మిగిలిన భాగాన్ని పూర్తిచేసి ఈ రామాయణ కల్పతరువును కావ్యశిల్ప తరువుగా అందించగలరని ఆశిస్తాను. ఇందుకు వారికి ఆ శ్రీరామచంద్రుడే అండదండగా ఉండా లని ప్రార్థిస్తూ -

బుధజన విధేయుడు,
నెమ్మాని సీతారామయ్య ఎం.ఏ
తెలుగు లెక్చరర్
ఆర్ట్సు & సైన్సు కళాశాల

బాపట్ల
22-11-91

శ్రీ విఖనస మహా గురవే నమః

# శ్రీ మద్రామాయణ కల్ప తరువు

## సరస్వతీ ప్రార్థనము

కలుష హారిణి! మాయమ్మ! కంబు కంఠి!
సకల సంసిద్ధి చేకూర్చు సరసిజాక్షి!
విద్య లందున కోరిన విజయ మొసగ
నిన్ను ధ్యానింతు రందరు నిశ్చయముగ!

పలుకు లాలికించు తల్లి! ఓ నలువరాణి!
సకల కార్యాలు సమకూర్చు శారదాంబ!
నాదు కావ్యంబు సిద్ధింప, నతులొనర్చి
ముందుగా నిన్ను ప్రార్థింతు ముద్దులమ్మ!

## విష్వక్సేన ప్రార్థనము

శ్రీ హరిన్ భక్తిమీఱ పూజించు గురుడు
శాంత మూర్తి విష్వక్సేన సహృదయుండు
సూత్రవతి జయనేలెడి సుందరుండు
నన్న భీష్టార్థ సిద్ధు నొనర్చు గాక!

## విఖనస మహర్షి స్తవము

భృగువు మొదలైన శిష్యులు ప్రీతి మీర
పూజ సల్పెడి విఖనస పుణ్యమూర్తి
ప్రథమ మందున ప్రార్థింతు భక్తి తోడ
సర్వ శక్తులు సమకూర్చి సాయపడగ

## మాతృ పూజ

బాల్యదశ నుండి కాపాడి బ్రతుకు దిద్ది
మహిని పేరంద, సత్కీర్తి సహితు జేయ
పాటుబడినట్టి మాయమ్మ పదము గొల్తు
శిరమునన్ దాల్చి భక్తి విశేష గరిమ.

## పితృ వందనము

సకల విద్యలు నేర్పించి, సభల యందు
పాండితీ పటిమంబును ప్రబల జేయ
పాటుబడి నట్టి మా తండ్రి సాటి యెవ్వ
రట్టి జనకుని గొల్చెద నమిత భక్తి

## విఘ్నేశ స్తవము

సకల కార్యాల విఘ్నంబు జరుగకుండ
తొలుత విఘ్నేశు పూజింతు దోసిలొగ్గి
మదిని ధ్యానింతు నే ప్రొద్దు మరువకుండ
ఆ మహాత్ముని చరణమ్ము లాశ్రయించి

## శ్రీరామ మంత్ర ప్రభావము

ఈషణ త్రయ విజయంబు నిచ్చు నట్టి
మంత్ర మొక్కటె శ్రీరామ మంత్రమిలను
భువిని మనుజుండు సుస్థిర బుద్ధి గలిగి
సేయ ధ్యానమ్ము; దానికి బాయు నఘము

# బాల కాండ

శ్రీ పతిన్ వేడ వెడలిరి శీఘ్రముగను
భూ సతియు, దేవతలు పరిపూర్ణ భక్తి
పాప భారంబు తొలగించి ప్రాపు నిచ్చి
రక్షణ మొసర్చు మనుచు ప్రార్థనలు సలుప!

దేవ దేవ! కాపాడుమో! దీన రక్ష
శత్రువుల బాధ మీరె, మా శక్తి జారె!
ఆర్త రక్షక! నిఖిలేశ! ఆది పురుష!
దయ వహించి రక్షించు ముదార చరిత!

లోక కంటక రాక్షసానీక మెల్ల
సురల బెదిరించి చీకాకు పరచ దొడగె
దిక్కులను ధిక్కరించె - మదించి మించె
కరుణ కాపాడుమో దేవ! కమల నాథ!

చేతులెత్తి మిమ్ముల స్తుతి సేయుచున్న
బ్రహ్మ దేవ పాకారి సుపర్వ తతుల
కనికరించుము శ్రీహరీ కమల నేత్ర!
దర్శనం బిచ్చి కామితార్థముల దీర్చి!

ముఖ కమల మందు కస్తూరి పుండ్ర మమర
కరము లందున శంఖ చక్రాలు వెలుగ
గళము నన్ తులసి మాలలు కాంతు లీన
స్వామి వారల ప్రేమ భావమున జూచె

అభయ మొసగుచు వారల నాదరించె
భయము బాపెద నంచును బాస జేసె
సర్వ లోకాల రక్షణ సల్పెదనని
పలికె వారల మురియించె భయమడంచె!

## కౌసల్యా పరిణయము

సకల లోక కంటకులను సంహారించి
శత్రు భయమును తొలగించి శక్తి బెంచి
భక్తులను బ్రోచు వాడ నిర్భయము తోడ
సమయ మారసీ యుండు డీ జయము కొఱకు

పరమ సరయూ నదీ తీర పురమం దందు
నాల్గు వర్ణాల వారలా నంద పడుచు
స్నాన సంధ్యాది జప తపాల్ జరుపు కొనుచు
సర్వ శుభము లయోధ్యలో జనులు గనిరి!

ప్రజల నే ప్రొద్దు కాపాడు ప్రభు వరేణ్య
డజ మహారాజు - వాత్సల్య మతి శయింప
తనయుడై నట్టి గుణశాలి దశరథునకు
పెండ్లి సేయంగ దలచె సంప్రీతి తోడ.

వంశ వృద్ధిని గావింప వసుధ మెచ్చ
మంచి వంశంబు నందలి మానవతిని
అరయ దూతల బిలిపించి ఆజ్ఞ నిచ్చె
పృథ్వి పతుల కన్యల నెంచ పేర్మి మీర!

పుడమి సర్వమ్ము తిరిగిరి భూమిసురులు
కనుల పండువ గలిగించు కన్య లెందు
గలరటంచును వెదకుచు - కడకు విసిగి
తగిన బాలల గాంచక దిగులు పడిరి

కోసలేశుని గారాబు కూతురయిన
బాల! కౌసల్య - సర్వ సౌభాగ్య యుక్త
కలదనుచు విన్న వెంటనే కలలు పండె
వారి శ్రమ ఫలియించె శుభమ్ము గలిగ

రయమునన్ జేరి కోసల రాజ్యమునకు,
ప్రభువు నరసిరి విప్రులు భక్తి తోడ
రాజు సేవించె వారల పూజ సల్పి
సర్వ మమమఠ వైభవమ్ము సాయపడిన!

కోసలేశుని పుత్రిక కోమలాంగి
తండ్రి పనుపున పెద్దల దరికి నరిగి
పాద పద్మాలపై బడి భక్తి తోడ
ప్రార్థన మొనర్చె వారు సంబరము చెంద

రాజ! నీ బిడ్డ దశరథు రాణి యగుట
కన్ని విధముల యోగ్యత నందియున్న
దనుచు విప్రులు కోసలేశునకు జెప్ప
ముదము గలిగించి నారలు హృదయ మలర

నీ తపము పండె నిక్కము - నీవు ధన్య
తముడవైతి వహో! పది తరము లెల్ల
నిశ్చయమ్ముగ విఖ్యాతి నెగడు నయ్య!
కోరి మా రాజు నల్లుగా గొనగదయ్య!

కోసలేశున కజునితో కుదిరె వియ్య
మా శుభ క్షణమందె - మహాత్ములైన
వారు దీవింప కౌసల్య మారె దశర
థేశు భార్యగ-కోరిక లెల్ల పండ!

పండితులు లగ్న నిర్ణయ ప్రతిభ జూపి
వ్రాసి రప్పుడె శుభలేఖ వాసి గన్న
దారల వియ్యమ్ము జగతినే మురియ జేసె
మంచి యోచన - ఎపుడు ఫలించు నిజ్జె

మందహాసంబు జేయుచు మనసు మెచ్చ
సుతుని కనుగొని మహారాజు శుభ్ర ఘణితి
సరయు నదిలోన నావపై నరుగ వలయు
పయనమై రంపటంచును పలికెనపుడు

వ. ఇట్లుండగ

లంక కేతించె నలువయు శంక లేక
మనుమనింగని ప్రేమతో ననియె నిట్లు
శుభము లిచ్చునె! నాయనా! సుఖ పరంప
రయును; ధన కనకములు నీ రాజ్య మందు

రాక్షసేశ్వరు డైనట్టి రావణుండు
తాత పాదాలకడ భక్తి దలను వంచి
అర్ఘ్య పాద్యాదులన్ పూజలంద జేసి
ప్రార్థన మొనర్చె యోగ్యతా ప్రాభవమున

వేద పన్నాలు వల్లించి వినయ సంప
దలను వెలయించి గృహమున నిలిపి సకల
గౌరవమ్ముల బ్రహ్మ నుదార లీల
సముచితాదర భావాన సత్కరించె

రాక్షసేశ్వర! బాహు బలమ్ము జూపి
శత్రు హననమ్ము గావించి జయము గాంచి
అనుపమ యశమ్ము గడియింపు మనుచు బలికె
సృష్టి కారణుడైనట్టి స్రష్టయపుడు

దిక్పతుల గుండెలదర భీతిని ఘటించి
దేవతా నీకమును గెల్చి దీప్తిగాంచి
మించి యున్నాడ నన్ను జయించు వార
లవని యెవ్వరు గలరు తాతయ్య చెపుమ?

విధిని గెలవగ రావణా! వీలుగాదు
లోక కంటక చర్య చీకాకు గూర్చు
వినయ మొక్కటె నిజమైన విజయ పథము
మరువకు మటంచు నలువ ప్రేమగ వచించె

తాత! పలుమాటలేల సత్యమ్ము పలుకు
ఇలను రణమందు నను జయించి, నాకు
ముప్పు గలిగించు వారలోకప్పుడైన
పుట్టుదురె భావికాలాన పుడమి యందు?

నీకు తెలియని విషయమా! లోక మందు
నన్ను బోలిన వీరుడున్నాడ? వాడు
నా యెదుట నిల్వగలడ? రణమ్ము నందు
తాత! వాస్తవ మింతయు దాచకయ్య!

మనుమడీలీల పలుక బ్రహ్మయును కోప
గించు కొనియెనో! ఏమొ! త్యజించె ప్రేమ
ఉన్న విషయమ్ము సర్వమ్ము నున్నయట్లె
చెప్పదొడగె, జాతక మెల్ల విప్పినట్లు

దశరథేశుని కొమరుండు ధార్మికుండు
రామచంద్రుండు నిన్ను సంగ్రామ సీమ
హతమొనర్చుట తప్పదటంచు బలుక
రావణుండుగ్రుడౌచు పల్కంగ దొడగె

మనుజమాత్రుని చేతిలో మరణమా! వి
చిత్ర విషయము తాత! వచించినావు
రాముడెవ్వడు? వాని సామ్రాజ్య మెచట?
తెలుపు మదియేమొ! ముందుగ తెలుసుకొనెద

బ్రహ్మ పకపక మని నవ్వి పలుక దొడగె
మనుమడా! రామచరితము మాన్య పఠవ్య!
పులకలగ జూపకయ్య! విశుద్ధ విమల
భావ మందిరమయ్య! ఇక్ష్వాకు గాథ.

వెలుచుండె నయోధ్యా మహీతలమ్ము
నజమహారాజు విపుల సాహస గుణాఢ్యు
డతని బిడ్డగ జన్మించె నమిత భక్తి
యుతుడగు దశరథుండు, సమున్నతుండు

సకల! విద్యల! జదివిన చతురుడతడు
వినయధనుడు ధనుశ్శాస్త్ర వేత్త; వక్త;
శత్రురాజుల నోడించి - జయము గాంచ,
తగిన, వీరకుమారుడు దశరథుండు

పెండ్లి! సేయగ! నెంచెను ప్రియ సుతునకు
నజమహారాజు వైభవమ్మతిశయింప
కన్య నెంచగ పంపించె ఘనుల, వారు
దేశ దేశాలు తిరిగిరి - దీక్ష పూని

ఉత్తరపు కోసలన్ గల ఉత్తములగు
విప్రవర్యుల జేరియు విజయ మొదవ
కోసలేశుని కొమరిత కోమలాంగి
తగిన వధువని యెంచి మోదమ్ము గనిరి

కోసలేశుని ఒప్పించి వాసిగాంచి
అజుని చెంతకు వచ్చి రయ్యార్యులపుడు
సంతసించె నజుండును సంబరమున
తగిన బాంధవ్యమనుచు చిత్తమున దలచి

లగ్న నిశ్చయ మొనరించె రాజు - కోస
లకు నయోధ్యకు వియ్యమ్ము లక్షణముగ
జరుగు - రాముడు గలుగు; నిస్సంశయముగ -
సత్యమని పల్కె; బ్రహ్మ వాస్తవము గదర

దశరథేశుని పరిణయ తరుణమగుట
పోయి వచ్చెద నిటనిల్చి పోవుడేను
త్వరితగతి వత్తునంచేగ తాను లంక
యందు బ్రహ్మను నిల్పి - అయ్యసుర నేత

పక్షి రూపంబు ధరియించి పరగజనియె
నాకసంబున రావణుండచటి కపుడు
నావలన్ బయనించెడి భూవరులకు
గుండెలదురుచునుండ నుద్దండలీల

పగుల గొట్టెను నావలు బ్రద్దలవగ
శకల శకలాల నొనరించె సాహసమున
సరయునదిలో బడినట్టి జనులు నీటి
వాలునంబడి సాగిపోవగ దొడంగె

వరుడు మంత్రియు జాతక బలమువలన
హరిని ధ్యానంబు జేసి రత్యంత భక్తి
వారి భాగ్యమ్ము పండె నాధార మేదొ!
దొరికె యొడ్డున కెక్కె సంబరము గనిరి

గౌరి నర్చించు కౌసల్య కనుల బడియె
నంత రావణుడామెపై నింతమత్తు
జల్లి యొక స్వర్ణ పేటి యందామెనుంచి
అపహరించె జయించె మదాంధుడగుచు

సంగమంబయ్యె సాగర సరయులచట
సొగసులు దిరుగుచు జలములు వడిరహించె
అచటి కరిగిన రావణుంపనియె నొక్క
మొసలితో - కన్నులుఱుముచు విసుగుకొనుచు

మరలినేవచ్చు వరకును మకరి! స్వర్ణ
పేటి నీనోట నిలుపుము - చేటు గలుగు
మాట తప్పితివేని - ముమ్మాటికింక
నిన్ను మన్నింప రాక్షసనేత నేను

రావణుండట్లు పల్కి- స్వర్ణంపు పేటి
మొసలి నోటను దాచి సమ్మోదమంది
కదలి లంకకు జని బ్రహ్మ కడకు నరిగి
తాత! గెల్చితిననుచు మోదమున బలికె

మకరమున కన్యమైనట్టి మకరితోడ
కలహమొదవిన తఱి నోట గరచినట్టి
పెట్టెనొడ్డున నిడి - తాను భీకరముగ
పోరసాగెను రెండవ మొసలి తోడ

భానుకిరణాల కాంతితో వరలుచున్న
స్వర్ణపేటిక కన్నులబడిన వేళ
దశరథుండు సుమంతుడు తాన్వహాభరితు
లగుచు పెట్టెను దెరచిరి మిగుల ప్రీతి

గౌరి నర్చించు కౌసల్య కానిపించె
నందు వారికి - మోదమ్ము నందినారు
నీవెవరివంచు? ప్రశ్నింప నిర్మలముగ
పలికె వారలతోడ నీ పగిది నామె

కోసలాధిపుబిడ్డను కూర్మిమీరార
పిలువబడుచుంటి కౌసల్య పేరు తోడ
దశరథేశునకీయగ దలచె తండ్రి
ఇచటికేలీల జేరితో! ఎరుగనయ్య!

మది సుమంత్రుడు గొప్ప సంబరము నంది
విఘ్నమగు లగ్నమిట్లు సంప్రీతి గదుర
కలిసివచ్చె నటంచు నుత్కర్షతోడ
దశరథునకామె నప్పుడు దానమొసగ

అగ్నిసాక్షిగ జరిగిన ఆ వివాహ
విధి సుమంతుని మురియించె వేడ్కగూర్చె
దశరథుని పాణిగ్రహియించి తన్మయమున
సతియు కౌసల్య హృదయ ముత్సాహపడియె

సంతసించిరి దేవతల్ సమయమరసి
స్వర్ణపేటికన్ జేరిరి సతియు పతియు
తలపులొక్కటి యాయెను, తనువు మురిసె
దంపతులు, లోన నిల్చిరి తత్క్షణమ్మె!

మొసలి జంటల జగడంబు ముగియ మరల
పేటినంతట నోటను బెట్టుకొనియె
రావణుడువచ్చి చూచి యుల్లాస మంది
తాత చెంతకు నేగెను త్వరిత గతిని

రావణుడు బ్రహ్మ కడకు శీఘ్రముగ నరిగి
దీనగలదేమొ! వెంటనే తెల్పుమనుచు
కోరగ విరించి నవ్వియింపార బలికె
"క్రొత్త జంట సుమా!" యని చిత్తములర

బ్రహ్మ వాక్యంబు వినుచు రావణుడు కినిసి
యిందువారల జూపు మింకేల ననుచు
పెట్టె తలుపును తెరచిన పిదప, యెదుట
కోరికల పంట కనిపించె క్రొత్త జంట

కత్తి దూసియు వారల గళము ద్రుంప
సిద్ధపడె రావణుడు - బ్రహ్మ చేరి పలికె
నీవు చంపంగ వారలు చావరయ్య
కోపమూనకు రావణా! కోవిదుడవు

వారిరక్తపు బిందువుల్ వసుధబడిన
రామరూపమ్ము లొకవేయి భూమి నిలుచు
నిన్ను చంపుదురిప్పుడే నిశ్చయముగ
కాన వర్జింపు మీర్ష్యను కఠిన చిత్త!

విధి విధానంబు దప్పించు విధము లేదు.
చేర్పు మీ ప్రొద్దు వీరల నేర్పుతోడ
ముందు వెనుకలు తెలిసియు బుద్ధి గలిగి
అనగ విని రావణుండట్లె - ఆచరించె

నగరవాసులు మెచ్చిరానంద పడిరి
ప్రేమ దంపతులన్ గని ప్రీతితోడ
పరిణయంబును సేయంగ వలయుననుచు
కంకణంబును దీక్షగ గట్టుకొనిరి

అట్టి జంటకు కొమరుడ నగుదు సకల
సజ్జనుల రక్షణమునకు సాయపడగ
వరముగా దీని భావింపవచ్చు మీర
లనుచు దర్శనమిడి స్వామి హరి వచించె

## శాంతా దేవి చరిత్ర

పూర్వకాలాన రోముండు పుణ్య గరిమ
పుత్రసంతాన కాంక్షతో పూనుకొనియె
యజ్ఞ కార్యమ్ము నతులిత ప్రజ్ఞ గలిగి
దీక్షగా నిర్వహించి సంతృప్తి నంద

ఇష్టి విభాండసుతుడు సేయింప దొడగె
పంచరాత్రాల లోపల భక్తి తోడ
రోమ పాదుండు శాంతను రూపవతిని
సతిగ నొసగె ఋష్యశృంగ సంయమికిని

రోమ పాదుని సత్పుత్రి రూపశాలి
దశరధేశుని కౌరస తనయ శాంత
నియత ధర్మాలు పాటించి నేర్పు గదుర
దేవతతి నెల్ల మెప్పించె దివ్యముగను

## పుత్రకామేష్టి

సకల విద్యలు నేర్చిన సహృదయుండు
సత్యనిష్ఠను పాటించు నిత్యయశుడు
యజ్ఞయాగాదులన్నియు ప్రజ్ఞ గలిగి
చేసి దశరధుడిలలోన వాసిగాంచె

ముగురు భార్యల లోపల ముచ్చటగను
పెద్ద భార్య కౌసల్య తా పేరు గాంచె
రెండవ సతి సుమిత్రయు ప్రేమమూర్తి
మూడవ సతి కైకేయియు ముద్దుల చెలి

మువ్వురుండియు భార్యలు ముదము గనుక
బిడ్డలొక్కరు లేక నప్రియము నంది
చింతతో ప్రొద్దుపుచ్చుచు చేయగడగె
బుధవరేణ్యుల పూజలు పుష్కలముగ

అనఘులైనట్టి వారలత్యాదరమున
యజ్ఞకార్యంబు గావించి అందుమయ్య!
పుత్ర సంతానమనుచును బోధ లిడిరి
సముచితమ్మైన అనురాగశక్తి జూపి

ఋషివరేణ్యుల రావింప కృషియొనర్చె
యజ్ఞకార్యంబు సేయింప నాజ్ఞయయ్యె
సంయమీంద్రులు ప్రేమగ సంతసమున
చేరిరాయె వసిష్ఠుడు సేయనాజ్ఞ

బ్రహ్మయాయె ఋష్యశృంగభద్రమూర్తి
యజ్ఞమారంభమయ్యె నత్యంతదీక్ష
నిర్వహింపగబడియెను నేర్పుతోడ
అగ్నికుండంబులందున ఆజ్యమిడుచు

పుత్రకామేష్టి యజ్ఞంబు పూర్తియాయె
దశరథేశుని హృదయమ్ము దనిసె, నగ్ని
కుండ మధ్యంబునందున కూర్మిమీర
పుణ్య పురుషుడుదయించె పుడమి మురిసె

నీలవర్ణంబు గలిగిన నిర్మలుండు
రోమజాలంబు నిండిన రూపువాడు
రక్త వస్త్రంబు ధరియించు రమ్యమూర్తి
పాయసాన్నంబు నింపిన పాత్ర తెచ్చె

ధరణినాథుని పిలిచి నీ తరుణులకును
పాయసంబును సాంతము పంచుమనియె
భక్తిభావాన రాజందె పాత్రనపుడు
కనులయందు నవానంద కణములొలుక

స్వర్ణపాత్రి నందించి తా చనియె స్వామి
శిరమువంచి నమస్కృతి సేసి - పిదప
ధరణి నాథుండు పాత్రిను కరములగొని
ముప్వురకు పంచెననురాగ, మోదమలర!

సగమునిచ్చె కౌసల్యకు సంతసింప
మిగులు సగమున సగము సుమిత్రికిడియె
కడమ సగమున సగమిడె కైకకపుడు
మిగిలియున్నట్టిదెల్ల సుమిత్రికిడియె

యజ్ఞము ను పూర్తిజేసిన యాజకులకు
దక్షిణాదిక గోదాన ధరణి దాన
స్వర్ణదానము లెన్నియో సలిపినాడు
బుధవరేణ్యులు మెచ్చగ భూవరుండు

అన్నదానము నెంతయు నధికముగను
సకల జనులు ముదమ్మున సఫలతగన
ఆజ్యధారలు నదులుగ అవని బార
సలిపె రాజు యజ్ఞాంతపు సమయమందు

అంతటన్ కొన్నిరోజు లట్లరిగి నంత
రాణు లెల్లరుగూడ గర్భవతులైరి
దశరథేశు డానందమ్ము నందడింప
శాస్త్రపద్ధతి జరిపించె సర్వవిధులు

## శ్రీ రామ జననము

చైత్రశుద్ధ న మి పగల్ సమయమందు
నుత్తమంబౌ పునర్వసుయుక్త కటక
లగ్నమందున కౌసల్య రాముగనెను
సకల జనులు సంపూర్ణ హర్షమున వేల

శ్రీవారియె పూర్ణమూర్తిగ సిరులు గురియ
అవని నాథునివాంఛతో అవధి మీర
కంటకులకెల్ల గుండెలు గాయపడగ
అవతరించె నయోధ్యలో ఆదిమూర్తి

సురలు కురియించె కుసుమాల సొబగువాన
దేవదుందుభుల్ మ్రోగెను దిక్కులదర
నటనసేసిరి గంధర్వ నారులపుడు
జయము జయమంచు పల్కి ప్రశంసలొసగి

పాదపములు ఫలకుసుమ భరితమయ్యె
సకల నదులు పారెనపుడు సరసరీతి
గోవులెల్లను పాలిచ్చె కోర్కెదీర
స్వచ్ఛముగ వెల్గె నగ్నియు సవనమందు

దేవలోకంబు నందుండి దివ్యముగను
కల్పవృక్షంబు కుసుమ సంఘము విదిల్చె
దుందుభులు మ్రోగె దివినుండి తుష్టిగలుగ
స్వరము పాడిరి గంధర్వ సతులు పేర్మి

జయము జయమంచు పలికిరి సర్వజనులు
గగనసీమల తారలు కాంతులొలికె
దిక్కులెల్ల విశిష్టమౌ దీప్తిదనరె
విష్ణుదేవుండు భువిని - ఆవిర్భవింప

తాను గనియెను కౌసల్య దాశరథిని
శ్రీమహావిష్ణు చక్రాంశు క్షేమముగను
అమిత సుందరమూర్తి నయ్యాదిదేవు
సకల జగములు మేలంచు సన్నుతింప

కనలలన్ శేషశంఖాంశ గలుగువారి
గనె సుమిత్ర సుతయుగ్మము గలుగజేసి
భరతుఁ గనియెను కైక శుభంకరముగ
పుణ్యకరమ్మగు సమయాన శోభ పెరుగ
బాలకులకు స్నానమ్ములు పరగ సలుప
పరిమళ జలకలశముల పదిల పరచి
పెద్దముత్తైదువలు వేగ ప్రీతి గదుర
సిద్ధపడి పురిటింటికి చేరినారు

## శ్రీరామ బాలలీలాభివర్ణన

లాలపోసియు లాలించె బాలకులను
ముఖ కమలమందు కస్తూరి పుండ్ర మిడుచు
పసిడి పులిగోళ్ళు మెడలందు ప్రతిఫలింప
తల్లిదండ్రులకానంద తతులు హెచ్చ
మొలల నమరించె బంగారు ముద్దు త్రాళ్లు
కొండికిన్ జుట్టె బాగసైన కుసుమమాల
బాలురందరు పారాడ భవనమందు.
మురిసిరా తల్లిదండ్రులు మోహజలధి
ఊయలలయందు బాలురనుంచి జోల
పాడి జోకొట్టి నిద్రించ — పాన్పునందు
కాంచె, కౌసల్య భ్రాంతితో కనులు తెరచి
పాముపై - పవ్వళించిన వాసుదేవు
ఆమె - అదిగని నిశ్చేష్టయగుచు నిలిచి
మోహమున దేలియాడి ప్రమోద మంది
తనయుడేమయ్యె ననుచును కనులు దుడుచు
కొనగ - నుయ్యెలలో తన కొమరుడుండె

మోహనాకారు కౌసల్య ముద్దు కొమరు
వేదవేద్యుని జ్యేష్ఠుని విమలతేజు
పిలిచె శ్రీరాముడనియెడి పేరుతోడ
దశరథుడు పెద్దలెల్ల ముదమ్మునంద

దశరథేశ్వరుడానందవశుడు పొంగి
జాతకర్మ మొనర్చెను శాస్త్రవిధుల
అధిక దానమ్ము లిచ్చినాడవని మెచ్చ
సిద్ధపురుషులు వచ్చి ఆశీర్వదించ

కైక పుత్రుండు భరతుడై ఘనత కెక్క
సుమతియైన సుమిత్రమ్మ సుతులు లక్ష్మ
ణుండు శత్రుఘ్నులైరి యుద్దండులైరి
తల్లిదండ్రులకానంద దాతలయిరి

శ్రీమహావిష్ణువే పుట్టి రాముడయ్యె
విష్ణు చక్రంబు భరతుండు విశదమాయె
ఆదిశేషుండు లక్ష్మణుడగుచు పెరిగె
పాంచజన్యంబు శత్రుఘ్న బాలుడహహా!

ఉపనయన విధి జరిపించె యుక్తముగను
గురువరేణ్యుల ననుమతిన్ కొమరులకును
దశరథుడు ప్రేమజూపుచు ధర్మవిధుల
శిరమునన్ దాల్చి వైదిక స్థితిని మెచ్చి

వేదవిద్య - ధనుర్వేద విద్య తనదు
తనయులకు గొప్పవారి శిక్షణమునందు
కొలది రోజులలో నేర్చుకొనెడి వీలు
కలుగజేసెను తండ్రి సంకల్పశక్తి

విపుల వక్షస్థలుండును విపుల నేత్రు
డయిన శ్రీరాముడప్పు డత్యాదరమున
అనుజులన్ గూడి విద్యలయందు నిపుణ
తను - ప్రదర్శించె గురుల దీవనలు గాంచె

శాంత గుణము ప్రసన్న ప్రశాంతదృష్టి
గలుగు శ్రీరామ భద్రునిగాంచి ప్రజలు
మురియసాగిరి - వాని సోదరులుగూడ
వానివలె పేరు గనిరి స్వభావమందు

బుద్ధిమంతుడు శ్రీరామ పుణ్యమూర్తి
మిత్రులందరితో గూడి మిగుల ప్రీతి
నాటపాటల నాడుచు నఖిలవిద్య
లందు నైపుణ్యమున్ గని యలర సాగ

## విశ్వామిత్ర యాగ సంరక్షణ

అసురబాధలు బాపంగ నవతరించె
విష్ణుమూర్తియె రాముడై పృథివియందు
దశరథాత్మజుడాయె నిత్తరి నయోధ్య
కరిగి వినిపింతుననుకొనె కౌశికుండు

సవన భంగంబు గాకుండ చక్కబెట్ట
రాముడొక్కడె మరియింక రాజులెవరు?
దుష్టులౌ రాక్షసాదుల దూలగొట్టి
కార్యసాఫల్య మొనరింపగల డతండు

మనము నందిటు లూహించి ఘనుడు మౌని
పయనమాయె నయోధ్యకు భక్తిగలిగి
స్నాన సంధ్యాదు లొనరించి చనియె రాజ
సభకు దర్పమ్ముతో మునిచక్రవర్తి

ద్వార దేశంబునందుండి ధరణి పతికి
కబురు పంపించె మునిరాజు కౌశికుండు
వెడలి వచ్చెను దశరథ విభుండు వేగ
గాధినందనుపై గల గౌరవమున

అర్ఘ్యపాద్యాది విధులతో నర్చనంబు
సేయగా నెంచి నరపతి శీఘ్రముగను
పెద్దలెల్లర రావించి ప్రియము మీర
గాధి సూతికి ప్రణమిల్లె కరము మోడ్చి

భక్తిభావాన బల్కెను ప్రభువరుండు
భవము బాపంగ మీరు మా భవనమునకు
వచ్చినారు మునీంద్ర! మీ వాంఛయేమొ!
తీర్పగల నాజ్ఞ యిడుడనె నేర్పు జూపి

విప్రవర్యులు వేదాలు విధిగ జదువ
వాద్యతతులెల్ల మ్రోగగ వాసిగన్న
ఋషివరేణ్యుని పూజించి పృథివి పతియు
తన భవనమున జేర్చెనమ్మునిని ఘనుని

పండితుల్ చేరి ఋషివర్యు ప్రస్తుతింప
గాధి సుతుడిట్లనెన్ ధరాకాంతు గాంచి
నేను యజ్ఞంబు సేయ బూసితిని రాజ!
అడుగవచ్చితి సాయమయ్యజ్ఞమునకు

సప్తరాత్రిలు జరిగెడు సవన దీక్ష
భంగపడనట్లు కాపాడ వలయునయ్య!
కోర్కె చెల్లింపుమా! నీవు - కూర్మిమీర
సత్యసంధుడవైనట్టి నిత్యయశుడ!

పుత్రుడున్నాడు నీకట - బాధులువెచ్చ
వాని నావెంట పంపి నీవాక్కు సత్య
వాక్కుగ నొనర్చుకొనుము భూవర! మదీయ
యజ్ఞము ఫలించుటెపుడు నా యభిమతమ్ము

ఆలసింపకుమో ప్రభూ! అనవసరము
రాము డొక్కడె యజ్ఞ సంరక్షణమ్ము
సలుపజాలినవాడు నిస్సంశయముగ
భయము వదలుము తప్పక జయము గలుగు

తనువు వణికె మహారాజు కనుల నీరు
పొంగి పొరలగ స్పృహతప్పి భువిని పడియె
తెప్పరిల్లియు లేచి యస్థిమిత మతిని
తనయులన్ - పంప సమ్మతి గనుకయుండె

పుత్రులన్ బంపగా జాల పుణ్యపురుష!
దయను జూడుము నాయందు తాపసేంద్ర!
పదములనుబట్టి ప్రార్థింతు సదయ హృదయ!
నేనె నీయజ్ఞ రక్షణ నెరపువాడ!

ధనువు చేబట్టగా లేని తరుణులయిన
రామలక్ష్మణులను - పంపరాదు స్వామి!
నన్ను మన్నించుమా మౌనినాథ! శరణు!
శరణు! శరణంటి గావుమా సంయమీంద్ర!

కరిరథ తురగ భటులతో కలసివచ్చి
సవన భంగంబు గాకుండ సకల విధుల
కాచియుండెద కరుణతో గనుము తండ్రి!
సుతులనంపగ జాలను సూర్యతేజ!

ఆగ్రహించె మహర్షి రాజ దరిపడియె
అరయ నిక్ష్వాకు వంశీయులనృతమాడు
రెరుగరనె - మౌని తన కనులెఱ్ఱజేసి-
దశరథుడు చేయునదిలేక తలను వంచె

కులగురువు నాజ్ఞ గైకొన గోరిపంపె
దశరథుని గాధిపట్టి - ఉత్తముడు పూజ్యు
డగు వశిష్ఠుడు మునివెంట నంపుమనియె
తనయులను - సమ్మతిన్ దెల్పె దశరథుండు

దశరథేశ్వర భయమని తలచవలదు
గాధిపట్టి సామాన్యుడుగాడు! రాజ
యోగ నిష్ఠుడు - శూరుడు - యాగరక్ష
ణార్థమంపుము సుతుల భయమ్ము వదలి

వానివెంటను పంపగా భయమదేల?
శుభము చేకూరు తథ్యమే నభయమిడుదు
పంపుమనగ వశిష్ఠుని పనుపుగొనుచు
పుత్రులన్ - పంపగాబూనె బుద్ధిగలిగి

రామలక్ష్మణులప్పుడు రమ్యలీల
గాంచువారల కన్నుల కరువుతీర
ధనువులన్ బట్టి వెడలిరి తపసివెంట
మునియు ఆనందమొందుచు ముందు జనగ

గంగ దరిజేరి రందరుత్కంఠతోడ
మఱ్ఱివృక్షంబు క్రిందను మంచికథలు
మౌనివర్యుడు వినిపింపబూనె - వారు
శ్రద్ధగా భక్తితో వినసాగిరపుడు

పత్రములుగూర్చి పాన్పుగ పవ్వళింప
హృదిని యానందమొందుచు సదయుడగుచు
బాలకులజూచి మౌనియు పరవశించి
చిట్టిచిట్టి కథల్ కొన్ని జెప్ప దొడగ

ముదము మీరంగ జెప్పెను ముఖ్యముగను
పద్మబాంధవ వంశజ ప్రముఖ చరిత
ముద్దుబిడ్డలు వినుచు ప్రముగ్ధులగుచు
నిద్రజెందిరి వేడ్కగ నిర్మలముగ

సెజ్జపైనను రాముడు సిరులు గురియ
పవ్వళించెను శ్రీహరి ప్రతిభ జూపి
భ్రాంతిజెందియు ఋషిరాజు భక్తిమీర
పదములంబడి మొక్కనుపక్రమించె

ఎంతటి అదృష్టమో! చెప్పనేల! నేడు
పుణ్యపురుషుని గంటిని ధన్యమాయె
తనువు - సత్యమ్ము నా తపోధనము దక్కె
కడుపుపండిన కౌసల్య ఘనత పెరిగె

దివ్యసూక్తులు పలికె నుత్తేజముగను
స్తోత్రములుజేసె ముని భ్రాంతి తొలగిపోవ
వేకువాయెను బాలుర వేగిరముగ
నిద్రలేపంగనెంచె మునిప్రవరుడు

కునుకు వదులుము కౌసల్య కొడుక! రామ!
అరుణుడుదయించె సంధ్యను జరుపవలెను
మేలుకొనుమయ్య శ్రీరామ మేలుగూర్ప
మనుచు మునిబిడ్డలన్ - కనుగొనుచు పలికె

స్నానమును జేయుమా రామ! సత్వరముగ
సకల తేజంబు నారోగ్య సత్ఫలంబు
మంత్రరాజంబు జెప్పెద మదిని నిల్పి
పఠనమున్ జేసికొనుమయ్య! భానుతేజ!

బలము గల్పించు బలమంత్ర ఫలము జెప్ప
భక్తితో రామచంద్రుండు పఠన సల్పె
శత్రు సంహార కారక శక్తి గూర్చి
రాము తేజంబు పెంచె శౌర్యము రహించె

అస్త్రశస్త్రాల నొసగి - అయ్యస్త్ర తతుల
నెట్లు విడచుటో! చక్కగ నెరుగజెప్పె
మునివరేణ్యుడు వారికి ముదము గూర్చె
స్థిమితముగ వారు నేర్చిరి దీక్షబూని

పరమపావన గంగను ప్రస్తుతించి
అవనిపతిబిడ్డలన్ గూడి యాచమించి
క్షుత్పిపాసలనడచు విశుద్ధమంత్ర
ములను మునివరుడన్నదమ్ములకు జెప్పె

రామ సౌమిత్రులనుగన్న లేమ పెట్టి
సుకృతమొనరించుకొనిరో! ఆ సుకృత మహిమ
జెప్ప వశమానెయనుచు విచిత్ర గతుల -
అద్భుతాశ్చర్యమున దేలె నా మహర్షి

సగరపుత్రులు భూమిని త్రవ్వుట

సరయు గంగల కథ మహాశ్చర్యకరము
వినుడనుచు జెప్పగడగె నవ్విధమునెల్ల
మునివరుడు - రాజపుత్రులు వినదొడగిరి
భక్తిభావాన శ్రద్ధతో ప్రణతులగుచు

సగర పుత్రులరువదివేలు సాహసమున
యజ్ఞదీక్షితుడౌ తండ్రి ఆజ్ఞగొనుచు
సగరు యజ్ఞాశ్వమును గనచనిరి వేగ
కార్యదీక్ష వహించి - ఉత్కంఠతోడ

భూమి త్రవ్వగబూనిరి భుజబలాన
వారు - నాలుగు దెసలలో వరలె నాల్గు
కరులు ప్రత్యక్షమై వానికరయ మ్రొక్కి
కదలి ముందుకు గాంచిరి కపిలమునిని

అటగరికమేయు, గుఱ్ఱము నరసివారు
సంతసంబంది పిదప ప్రశాంతిగనక
క్రుద్ధులైపోయి యా మునిన్ గేలిజేసి
శిలలశూలాల నతని శిక్షించినారు

విష్ణురూపుడు కపిలుండు వేగముగను
రోషమొందియు శపియించె దోషులయిన
వారి జూపులతోడనే - వారలపుడు
భస్మమయిరరువదివేలు భగ్గుమనుచు

మరల కొన్నాళ్ళకట కంశుమంతుడనెడి
రాజువచ్చి కపిలు కృప రాణకెక్క
తాత కశ్వంబు నొసగియు ధన్యుడాయె
యజ్ఞకార్యంబు పూరించె ప్రజ్ఞజూపి

వారి వంశాన బుట్టిన ధీరవరుడు
ఆకసంబున నుండెడి అమరగంగ -
కోరి భువిపైకి దింపి - భగీరథుండు
సగర పుత్రుల - ఆత్మలు చల్లబరచె

వారలందరు ముక్తులై వరలినారు
సాగరమ్మగు మనయ్యది సన్నుతముగ
త్రిపథగామినిగా పేరు దెచ్చుకొనియె -
ఇది తదీయకథాంశము చెలగఁజెప్పి

## తాటకివధ

మార్గమధ్యమ్ము నందున్న మనుజశూన్య
మైన విపినంబిదియునెట్లు హీనమయ్యె
చెప్పుమనుచును సోదరుల్ చేరియడుగ
మునియు తెల్పె నీరీతిగ ముదముతోడ

మనుజులెవ్వారు కనరాని మార్గమిద్ది
కాననము ముళ్ళబాట నిక్కముగ రామ!
కాని రాక్షసులిచటనే కాపురమ్ము
సలుపుచున్నారు వారల జంపవలయు

అట్టి యొకరాక్షసుడు సంతుకాస జెంది
బ్రహ్మనర్థించె నతడొక బాలనిచ్చె
వెయ్యి యేనుంగుల బలాన వెలుగునట్టి
తాటకయె వాని కూతు రధర్మశీల

మానవులనెల్ల భక్షించు మధువు గ్రోలు
మట్టుబెట్టుము దానిని పట్టుబట్టి
సకల లోకాలవాసులు సంతసింతు
రాలసింపక రామ! నాయాజ్ఞ యిద్ది

దీనివలననె యెల్లరు గాసి జెంది
పారిపోవ దొడంగిరి ప్రాణభీతి
కలిగి - రక్కసిగుంపుల నిలయమాయె
సంశయింపక దీనిని జంపుమయ్య!

ముదముగల్గు జగతికిని పుణ్యమబ్బ
నీకు - ప్రాణాలు సుఖముగ నిలుచునిచట
సంశయింపకు రామ! నా శాసనంబు
విపుల గుణధామ లెమ్మిక విజయమంద

అనుచు మునిరాజు (శ్రీ)రామునాజ్ఞ సేయ
ధనువుబట్టెను రాముండు ధరణిమెచ్చ
తరుణి చంపుట యెట్లయ్య తాత! నేను
పాపకార్యంబు సేయుట పాడియగునె!

మౌని రామునకిట్లనె మంచిదయ్య!
రామ! పాపమొనర్చెడి భామ యీమె
మానవాళిని చంపెడి మగువ గనుక
చంపవలె శూరులెపుడు నిస్సంశయముగ

వినిన రాముడు సందియమ్మును త్యజించి
మౌని యాజ్ఞచే ధనువున మౌర్వి లాగ
ధ్వనిని వినగనె తాటకి తరలివచ్చె
తీవ్రకోపంబుతో రాము దేరిచూచె

అడవిమధ్యన నేనుండ నరుగరెవరు
భయములేకయె యిందేల వచ్చినారు
మీరలెవ్వరు? నేటికి దీరెకోర్కె
మంచి నరమాంసమిపుడు లభించె నాకు

రండురండంచు నేడొక పండుగనుచు
నోరు తెరచి తాటకి పండ్లునూరి చూచె
రామలక్ష్మణు. లరిపుర - రక్కసులకు
దయయు. దాక్షిణ్యముండునే ధరణినెపుడు?

రాముడును ఆగ్రహించి పరాక్రమించి
శరము సంధించె తాటకి యురముమీద
కేకబెట్టుచు రాక్షసి క్రిందకూలె
పచ్చనౌ ప్రకృతి మురిసె మెచ్చెమౌని

సకల సురలు సుమాలవర్షమ్ము గురిసి
రవ్వడనియె విశ్వామిత్రుడాదరమున
కార్యసాఫల్యమును గెల్వగలిగినావు
రామ! నీవని మురిసి మూర్ధమ్ము నిమిరి

## యాగ సంరక్షణము

అంతవారలు వెనువెంట నరుగుదేర
ఆశ్రమమ్మున కరిగినాడా మునీంద్రు
డచటివారికి జూపించెనపుడు రమ్య
మూర్తులైనట్టి అన్నదమ్ములను పేర్మి

వారుశరధారులై నిల్చినార లాశ్ర
మమ్ము వెలుపల - హోమ కార్యమ్ము సలుప
పూనుకొనె, చరుసమిధాజ్య పుష్పనిచయ
ములను గైకొని దీక్షనుబూని మౌని

సభ్య పౌండరీకాగ్నుల చక్కబరచి
అన్వహార్యము మొదలైనయట్టి కుండ
ములను వేల్వగడంగె నా మునివరుండు
పుణ్యమూర్తి విష్వక్సేను పూజసల్పి

మథనమునవచ్ఛ నిష్ఠతో మౌనివరుడు
మంత్రయుత హోమవిధుల సంబరము గదుర
సలుపదొడగెను - రామలక్ష్మణులు యజ్ఞ
శాల రక్షించుచుండిరి సాయుధులుగ

నీచులయిన సుబాహు మారీచులపుడు
కోపఘూర్ణిత నయనులై ఘోరముగను
రక్తమాంసాల విపులవర్షమ్ము గురియ
జేయబూనిరి యజ్ఞమ్ము జెరచుకొరకు

అగ్నిబాణమ్ము వదలి క్రోధాగ్నియందు
రాముడు సుబాహు ప్రాణమ్ములన్ గ్రహించె
వాయుబాణమ్ము మారీచు వదలకుండ
వార్థిబడవైచె - నంతతో వదలెపీడ

ఒక్క శరమును సంధింప దిక్కులేక
రక్కసులగుంపు పరుగెత్తె, రక్షణమ్ము
జరిగె మునియజ్ఞమునకు - ప్రశాంత చిత్తు
డగుచు పూర్ణాహుతి యొనర్చె నా మహర్షి

ముద్దుబిడ్డల గాంచిరి మునిగణములు
మురిసిపోయిరి బాలుర ముద్దుజేసి
గొప్ప దీవనలిచ్చిరి - మెప్పుజూపె
రామలక్ష్మణులకు మునిరాజు పేర్మి

### అహల్యా శాపవిమోచనము

మిథిలనుండి యచ్చోటికి మేటిభటులు
వచ్చియిచ్చిరి శుభలేఖ భక్తితోడ
మునివరేణ్యుడు చేనంది ముదముజెంది
చదివె శుభలేఖ రామలక్ష్మణుల ముందు

చాలకాలము నుండియు జనకునింట
పశుపతీశుని ధనువుండె - భక్తితోడ
నిత్యపూజలు జనకుండు నెరపుచుండె
తనయ సీతయు తాను ముదమ్ము తోడ

ధనువునెక్కిడు వారికి తనయనిచ్చి
పరిణయ మొనర్పదలచితి ధరణిగల్గు
నరపతులు వచ్చి గెలిచిమన్ననల గనుడ
టంచు శుభలేఖయందలి యర్థముండె

చదివి మునిరాజు సంతోష సాగరమున
మునిగితేలుచు ననియెను ముచ్చటగను
రామలక్ష్మణులార! బిరాన మనము
మిథిల కరుగంగ కలుగును మేలు నిజము

అడవిమార్గంబు చూచుచు నరిగిరచటి
ముఖ్యవిషయాలు చెప్పుచు మునియునరిగె
బాలకుల మనసెంతయో పరవశించె
మార్గ మరయుచు సాగిరి మమతదీర

రామచంద్రుడడిగె, మునిరాజు జూచి
శూన్యమైయుండె యీ వనశోభగనగ
కారణంబేమొ తెల్పుడు కనికరించి
అంచునడిగెను జిజ్ఞాస - అతిశయింప

ఆశ్రమంబెవరిదయ్య! మహర్షివర్య!
సర్వమెరిగింపుడని రామచంద్రుడనగ
గౌతమాశ్రమమిది - దీనిగాథ వినుడు
తెల్పెద నటంచు మునిరాజు తెల్పదొడగె

బ్రహ్మదేవుండు సృష్టించె పడతిమిన్న
చక్కనైన అహల్యను - సంయమియగు
గౌతముని భార్యయై - ఆమె గడుపదొడగె
కాలమీ యాశ్రమమ్మున కాంతుతోడ

అమరనాథుడు కామించి ఆ అహల్య
నెట్లయినగూడనెంచియు నెదురుచూచు
చుండెనొకనాడు పాపమ్ము పండె - మోస
గించి యింద్రుడహల్యతో క్రీడసలిపె -

వేత్తయగు మౌనికిదియెల్ల విదితమాయె
సతియొనర్చిన ఘోరదోషమ్ము నెరిగి
ఉగ్రుడై గౌతముడు తన ఊహాయందు
సర్వము మథించి భార్యను సంశయించె

సతినిగని మౌని యించుక శాంతిలేక
పరులనంటిన పాపంబు పడతి నిన్ను
జెందియున్నది - క్షమియింప సిగ్గుమాలి
నీవు శిలవయి ధరపయి నిలువుమనియె

శాపమునకు భయంపడి జంకి - ఆమె
నను క్షమింపుము ప్రాణేశ! నాదు దోష
మును హరింపగ జేయుమంచును వచించి
పాద కమలాలు గట్టిగ పట్టి వేడె

త్రేత వచ్చును - లోక సంత్రాతయైన
శ్రీహరియె రాముడై యిట జేరునప్పు
డాయన పదాలధూళి నిన్నాదుకొనును
శాపమోక్షమ్ము గలుగు నిస్సంశయముగ

గాధి పుత్రుండు వినిపించె కథ, సమస్త
మాలకించిరి సోదరు లంతలోనె
పాదరజముపై బడ పూర్వ పాపమడగి
శిల అహల్యగ మారె విచిత్రముగను

రఘుపతీశుని పాదాలరజము సోక
రాతిగానున్న - అహల్య నాతియగుచు
దేవ! దేవ! నా దోషంబు తీరిపోయె
ధన్యనైతినటంచు వందన మొనర్చె

వచ్చెనపుడె గౌతమముని యచ్చటికిని
సతిపతుల్ కలసిరచ్చోట సంతసమున
రామచంద్రుండు వారికి ప్రణతి జేయ
దీవనలొసంగి సాగిరి త్రోవ వెంట

ఆకులలములు తినుచు నాయడవియందె
వాసమేర్పడ తపముచే వరలుచున్న
గౌతము డహల్యయును రాము కరుణ వలన
క్రొత్త జీవితలీల చేకూర్చుకొనిరి

## సీతా కల్యాణము

అన్నదమ్ములు ముందున కరిగినారు
గౌతముడహల్య ముదమును గాంచినారు
కౌశికుడు సాగె రాము నగ్రిమ్మునందు
మిథిల జేరిరి వారలు మిగులప్రీతి

జనక భూపాలుడెదురు వచ్చెను మహర్షి
చరణ యుగళిని గొల్చెను సంబరమున
అర్ఘ్యపాద్యమ్ము లొసగి సమాదరించి
సోదరుల నిర్వురన్ బ్రీతిజూచె నంత

చూచువారల మనములు చోద్యమంద
బాలబాస్కరులో! యన వరలు రామ
లక్ష్మణులగని మౌనితో రాజు పలికె
ఎవరు వీరని మెచ్చుచు ప్రేమతోడ

దశరథుని బిడ్డలిద్దరుద్దామబలులు
రామలక్ష్మణులనెడి వీరులు పరాక్ర
మాతిశయమున నిలిచిరి మాకు సాయ
పడిరి - పిన్నలుగావచ్చు పిడుగులగుచు

మార్గమధ్యాన గౌతమ మౌనిసతికి
శాపమును బాపినారు ప్రసన్నులగుచు
వారిగొని నేను మిథిలకు వచ్చినాడ
మీదు శుభలేఖ నంది సమ్మోదమంది

శ్రవణ పేయకథన్ విని సమ్మోదమున
అమ్మకానాడు శాపమోక్షమ్ము గలిగ
ననెడి గాధేయు పలుకుల నమిత భక్తి
విని శతానందు డానంద వివశుడయ్యె

గౌతమాత్మజుడిట్లనె గౌరవమున
రామచంద్రుని వీక్షించి రమ్యఫణితి
సర్వమ్మును వినిపించెద సర్వులెరుగ
గాధిపుత్రుని రమ్యమౌ గాధ మీకు

అల వశిష్ఠమహర్షి మహానుభావు
డా మునీంద్రుడు శబలయనట్టి గోవు
నొక్క దానిని పెంచుచు నుండె మహిమ
లున్న దానిని మంచిపేరున్న దాని

శబల సర్వమ్మొసంగగ జాలినట్టి
శక్తికలధేనువగుటచే - సాగుచుండె
నా వశిష్ఠుని యజ్ఞములన్నియును ప్ర
శాంత వైఖరిగలిగి ఆ సాంతములుగ

నాడు రాజ్యమ్ము నేలుచున్నాడు గాధి
సుతుడు ప్రభుపీఠమున నరపతిగ నిలిచి
అతడు కనుగొని శబలపై నాసజెంది
కోరెను వశిష్టు దాని చేకొనగ నెంచి

గాధి తనయుని వాంఛను కడకు ద్రోసి
శబలనీయ వశిష్టుడు సమ్మతింప
డాయె - నపుడు విశ్వామిత్రుడెంతో కినిసి
తపమొనర్చి గ్రహింపగా దలచి నిలచె

గొప్ప తపమొనరించెను ఘోరమైన
దీక్షగొని గాధిసుతుడు పరీక్ష గెలిచె
అట్టి మహనీయుడిపుడు మీ కాయె గురువు
బాలులార! మహోదృష్ట భరితులార!

గాధి సుతునకు రామలక్ష్మణులకపుడు
విడిది గృహములొసంగిరి విభవమొప్ప
వారచట స్నానసంధ్యలు వరలజేసి
సంతసంబున జనకుని సభకరిగిరి

జనకుడేర్పాటు చేసిన సభనుజూడ
రామలక్ష్మణులన్ గూడి ప్రేమతోడ
గాధిసూనుండు వెడలెను, ఘనులు పెద్ద
లాదరమ్మున వచ్చి - ఆహ్వానమిడగ

మౌని సరసన రామలక్ష్మణులు నిలిచి
సభగల విశేషములు చూడసాగినారు -
వారి నిరుపమ సుందరాకారులను, ము
దమ్మునన్ జూడసాగె జనమ్ములెల్ల

బలము గలవారు పదివేల భటులు ధనువు
గలిగియున్న పెట్టెను దెచ్చి నిలిపినారు
చూచి రాజులు భయమంది చోద్యపడగ
కలకలమ్ము సభాస్థలి నలముకొనియె

శంకరు శరాసనమ్మిది చాలకాల
మిచటనే యుండె మాయింట నిపుడు దీని
నెత్తగల వీరునకు సీత నిత్తు ననుచు
జనకుడచ్చటి వారికి మనవి జేసె

కోటిచంద్రుల వెలుగుతో తులుకుచున్న
హరుని విల్లును గని రాజులందరపుడు
బుద్ధి పూర్వకముగ నెత్తబూనుకొనిరి
జనకు హృదయాన మోదమ్ము సందడింప

సౌధ భాగంబునందున్న సాధ్వి సీత
కుసుమమాలను చేబట్టి కూర్మి మీర
సమయమారసి సభయందు జరుగుచున్న
సర్వమును గాంచుచుండెను సంబరమున

ధనువు జూచుటకై రాజ తనయులెల్ల
రందురండని పిలుచుచు రాజు పలికె
నా కుమార్తెను సీతను జేకొనంగ
భుజబలము జూపుడనుచు బ్రముఖుడగుచు

రాజులెల్లరు దరిజేరి రాజధనువు
గాంచి శంకించి ఎక్కిడగలమె యంచు
తలచి మానిరి కొందరు - దర్పమడర
పూనుకొని కొందరట నవమానపడిరి

లంక నేలెడి రాజగు రావణుండు
పుష్పకంబును దిగివచ్చి భుజబలాన
గర్విష్ఠుడై శరము నెక్కిడ గలనటన్న
ధైర్యమును బూని నిలిచె మదమ్ము జూపి

పంపకున్నారు శుభలేఖ పాపమేమి
చేసితినటంచు మించి గర్జించిపల్కె
రాజసంబున శివధనుర్భంగ మిపుడు
కలుగుననుచును తాను భంగమ్ము నందె.

పండ్లు బిగపట్టి ఎంతయో పట్టుబట్టి
ఎత్తలేక నెట్టెట్టులో! యెడద వరకు
నెత్తి యాపగ జాలక నొత్తిగిల్లి
గిజగిజల తన్నుకొనుచును క్రిందపడియె.

రాక్షసేశుడు పడిపోవ - రాజు పలికె
వీరులెవ్వరైన లేచి యీ దారుణమ్ము
తొలగజేసి వీనికి మేలుగలుగ జేయు
డీత డెళ్లని యింటికి నేగునట్లు

పలువురు బలాఢ్యులా విన్నపమ్ము వినియు
వేగ ధనువును దొలగింప; వెడలెవాడు
తిరిగి చూడక లంకకు - గరువమెపుడు
ఘనత గూర్చునె! కూర్చునే గౌరవమ్ము!

జనకుడంతట లేచి యీ చాపమెక్కు—
వెట్టి సీతను గొనుడని విశదముగను
మరల మరియొకమారు తా నెరుకపరచె
వినయముగ కార్యదీక్షత వెల్లివిరియ

ఆలసింపక లెండయ్య! అధిపులార!
చూడ సుందరులైనట్టి శూరులార!
వీరులార! యటంచును వేడుకొనియె
సమయమిది శౌర్యమునకని, జనక విభుడు

రిత్తపోయెనె లోక మీరీతి నిదియు
నిండు సభ యెవ్వరిటలేరె! నిరుపమాన
శౌర్యధనులంచు గట్టిగ జనకుడనియె
యెత్తి పొడుచుచు సకల రాజేశ్వరులను

జనక నరపతి పలుకులు వినిన లక్ష్మ
ణుండు క్రోధమ్ము బూని ప్రచండుడగుచు
పురుష సింహుడు మా - అన్న పూజ్యుడుండ
వీరులిట లేరనుట గొప్ప వెఱ్ఱిగాదె

అనెడి లక్ష్మణు మాటలర్థాంతరముగ
ఆపి కౌశికుడిట్లనె - అయ్య! సభల
నిట్టి హెచ్చరికలు సాగునెప్పుడేని
అలిగి యెవ్వరునిట్లు మాట్లాడరాదు

ముద్దుమాటలు చెవులకు ముదము గూర్చ
లక్ష్మణా! పల్కవలదింక - రామభద్ర!
లేచి రావయ్య! నీవవలీల శివ శ
రాసనము - భగ్న మొనరింపుమయ్య! వీర!

వృషభ గమనంబుతో సభ విస్తుపోవ
కమల నయనుండు రాముండు కదలివచ్చి
సోయగమ్ముగ శివధనస్సును గ్రహించి
ఫెళ్ళుమనిపించె - నృపకోటి భీతిజెంద

జనకుడబ్బురపడె - రాజ సౌధమందు
నిలిచి చూచెడి సీత కోర్కెలు ఫలించె
విల్లు విరువగ వచ్చిన వీరవరుల
తలలు ధరణికి వంగె! ఖేదమ్ము పొంగ

రాజు జనకుండు - మరి మునిరాజు దప్ప
కడమ వారెల్లరున్ భయపడినవారె
మూర్ఛ జెందినవారె! సమ్మోహితులయి
తెప్పరిల్లనివారలే! చెప్పనేల

సిగ్గుమాలిన వారెల్ల చెప్పగడగి
రది శివధనుస్సు పాతది - రాలి పడెడి
తుప్పుగలిగిన దిద్దాని ద్రుంచుటొక్క
గొప్పయా! యని లోలోన గొణుగుకొనుచు

వినిన లక్ష్మణుడాగ్రహించెను పరాకు
మాని చూడుడటంచును మాని కడకు
తెచ్చి విరిగిన ధనువును వచ్చినట్టి
రాజులకు జూపె కన్నులెఱ్ఱంగ జేసి

మదిని హర్షంబు జనియింప మందగమన
సౌధమును దిగె సీత, విశాలనయన!
దిక్కులాహ్లాదమున దేల దీప్తివిరియ
కంకణమ్ములు మ్రోగంగ కదలివచ్చె

భువనసుందరి సీతమ్మ! ముదము తోడ
మందహాసంబు తోడను విందు సలిపె
మధుర మందార కుసుమాల మాలను గొని
ముదము కొనుచును రామ సుందరుని జేరె

సులలితమ్మైన శ్రీరాము గళమునందు
సీత అర్పించె హారమ్ము ప్రీతితోడ
సభ పరవశించె జనకుడు సంబరపడె
గాధి తనయుని నయన యుగ్మమ్ము మెరిసె

పుటము బెట్టిన బంగారుబోలు తనువు
హారిణ నయనాలు గలిగిన - అందగత్తె
ముఖ కమలమందు కస్తూరిబొట్టు దిద్ది
రత్నహార విభూషయై రాము జేరె

భూమిపై - కురియించిరి పూలవాన
దేవతలు దివినుండియు దీప్తి గదుర
దుందుభులు మ్రోగె ప్రవిమలానందలీల
అప్సరసలాడినార లాహ్లాదముగను

ధరణిజను రాము పాదపద్మాల చెంత
నిడిన జనకుండు ధన్యుడై యెల్లదేవ
తలకు మ్రొక్కెను - గాధి నందనుని కరుణ
కంజలి ఘటించె - ఆనంద మందుకొనియె

మాండవీ శ్రుతకీర్తుల మమత మీర
భరత శత్రుఘ్నుల కొసంగి పరిణయమ్ము
జరుప తమ్మున కాజ్ఞ యొసంగె - ఊర్మి
ళాకుమారిని యిడబూనె లక్ష్మణునకు

శాస్త్రవేత్తల రావించి సవ్యముగను
లగ్న పత్రిక వ్రాయించె రాజవరుడు
దశరథేశుని కడ కంపె తగినవారి
వియ్యమందెడి విషయమ్ము విన్నవించి

అది మహోత్సాహ వేళ - అభ్యుదయలీల
ఏకకాలాన కుదిరిన యిన్ని పరిణ
య ప్రభలతో మిథిలయు మహాత్తరముగ
వెలుగు జిలుగుల జల్లుతో వెల్లివిరిసె

తనయులకు పెండ్లి జరిపెడి తరుణమనుచు
జనకుపంపిన శుభలేఖ చదువుకొనిన
దశరథుడు సంబరమ్మున తరలివచ్చె
ప్రముఖ మిత్రులగూడి సబాంధవముగ

ఇంద్ర విభవమునన్ మిథిలేశు కడకు
దశరథేశ్వరుడరిగె మోదమ్ము తోడ
జనకుడెదురేగి ఘనమైన స్వాగతమ్ము
నొసగ వాద్య విశేషమ్ములెల్ల మ్రోగ

జనకుడపుడు వశిష్టుని సంప్రదించి
వలసినట్టి పదార్థముల్ పదిలపరచి
మంజులమ్ముగ కళ్యాణ మందిరమును
రమ్య శోభలమించి యలంకరించె

కుశికనందను పాదాలు గొల్చి పిదప
ఆ మహార్షి అనుజ్ఞ తానంది - యెల్ల
బుధులకు నమస్కరించి సంపూర్ణ తృప్తి
గాంచి జనకుడు పరిణయ క్రమము నడిపె

రామ సోదరులెల్లరు ప్రేమ మీర
తల్లులకు మ్రొక్కి తండ్రి పాదాలపైన
శిరములుంచిరి వారి యాశీస్సులందు
కొనగ వినయ విధేయ భావనలు పొరల

దశరథేశుని కొమరులు, ధర్మవిధుల
సర్వమును నిర్వహించి ప్రశంసనీయ
పరిణయ ప్రభ గుల్కుచు తరలినారు
విమల సుందర కళ్యాణ వేది కడకు

మంచి ముత్యాల మాలలు, మంచి పెళ్ళి
పందిరులు - పున్గు జవ్వాజి పరిమళాలు
సకల శోభల నందింప - సర్వశుభము
లమరె కళ్యాణ మందిరమందు నాడు

జానకి నలంకరించె ప్రశస్త సకల
భూషణమ్ముల బెట్టి - అపూర్వ శోభ
వెలుగులీనగ, ముత్తైదువలు మనోజ్ఞ
భావములు పూలజల్లులై పరువులెత్త

మధుర రూపాన కళ్యాణ మంటపమున
భూమి సుతవచ్చి కూర్చుండె పొల్పుమీఱ
కనులపండువ గావించు కలిమి బలిమి
గాంచి యెల్లరు విభ్రాంతి గాంచుచుండ

పరిణయపువేళ నిఖిల శుభమ్ములాదట
సకల దానమ్ము లొనరించె జనక నృపతి
ప్రథితమైన కన్యాదాన ఫలమునందు
సమయమే లెంచి జీవితాశయము పండె

ఉభయ వంశాల గోత్రమ్ము లొప్పజెప్పి
మూడు తరములవారి సంపూర్ణ నామ
ములను పఠియించి పరిపరను - పలికినారు
వేదవేత్తలు కల్యాణ వేది మీద

విధి విధానంబు - తెలిసిన విజ్ఞులెల్ల
వేదమంత్ర విశేషముల్ వివరముఁగను
పఠన మొనరించి నారలు భక్తి మీర
అగ్ని వెలిగించి వేల్చుచు నాజ్య మిడుచు

పెండ్లి కొమరుల పాదాలు ప్రీతి గడిగి -
ఉంగరమ్ములు చదివించి రుచిత రీతి
స్వర్ణ కంకణములు కట్టి వైభవముగ
పరిణయమ్మును క్రమముగ నెరపినారు

రామచంద్రుని దోయిట రమణినపుడు
దాన మొనరించె జనకుండు తత్పరుడయి
ఇతర సోదరులకు దాన మిచ్చిరితర
కన్యలను వేడ్కమీరగ ధన్యత గని

సర్వ వాద్యాలు మ్రోగెను సంబరముగ
స్వస్తి వాచకములు పల్కె శాస్త్ర విధిని
పెద్దలెల్లరు, మిగుల సంప్రీతి జెంద
ఎన్నియో, గానవైఖరు లింపుగూర్చె

జానకీరామ కల్యాణ సమయమందు
గగనమున పూలవానల కాంతి నిండె
మంద మారుత మది వీచె మహి సమస్త
మధిక సంతోష వైభవ మనుభవించె

సీత గళమున రాముడు ప్రీతిమీర
సురచిరంబైన మంగళ సూత్రమపుడు
ధారణ మొనర్చె - ఆనంద ధాముడగుచు
లోక కళ్యాణ వాంఛా విలోలుడగుచు

ఇతర సోదరులకు నట్లె యింపు గూర్చు
రీతి పరిణయ కార్యమ్ము లీలజరిగె
జనులు సంతోషపడిరి ప్రశాంత చిత్తు
డగుచు జనకుడు సంబర మందెనపుడు

చెప్పతగినట్టి ధర్మముల్ జెప్పినాడు
తనయలకు జనకుండు ముదమ్ము మీర
సుతలనల్లుళ్ళ ప్రేమగ జూచి వారి
కాదరమ్మున కానుక లందజేసి

దీవనలొసంగి, దశరథ భూవరునకు -
అప్పగించెను జనకు డయ్యవసరమున
దంపతులు గురువరుల పాదాలు భక్తి
భావమున మ్రొక్కి-రానంద పడుచునపుడు

## పరశురామ గర్వభంగము

కొడుకులందర కోడండ్రు కూర్మిమీర
వెంట నిడుకొని పయనంబు వేగ సలుప
దశరథేశుడు రథమున తరలెనపుడు
వాద్య తతులెల్ల మ్రోగ సంబరముగూర్ప

మార్గమధ్యంబునకు జేర మనుజ విభుడు
పరశురాముండు వచ్చెను పరశుబట్టి
కోప మూనియు పల్కెను చాపమూని
రామచంద్రుని జూచుచు రథము పైన

తనువు వణకంగ దశరథ ధరణిపతియు
పరశురాముని జూచియు ప్రణుతి జేసి
పసుపు బట్టల మా రామభద్రునిపుడు
కరుణ జూడుము స్వామి! మమ్మరసి ప్రీతి

క్షత్రియాధమ! శ్రీరామ! క్షత్రియుడవ!
శివుని వింటిని విరచుట చేవయగునె!
పౌరుషంబున్న నాతోడ పోరుసలుపు
మనుచు గర్జించె పరశురామాఖ్యుడపుడు

రాముడామాట విని మహోగ్రముగ లేచి
విప్రవరుడవు గావున విడుచుచుంటి
తగునె! యీలీల పేలుట ధర్మమగునె!
అనుచు పలికెను దశరథుడదిరి పడగ

అడవిలో తాటకను జంపినంత విఱ్ఱ
వీగుటది గొప్పయా! యేమి? వీరకోటి
మెచ్చునా పిచ్చివాడ! నే మెచ్చుకొనెద
పౌరుషమ్మున్న జూపుమా! ప్రధనమందు

పరశురాముడు పలికిన పలుకులు విని
క్రోధమున్బూని రాముండు - క్రూరుడైన
పరశురామునిపై బాణపటిమ జూప
ధనువు గైకొని ధీరతన్ తరలివచ్చె

విష్ణు తేజమ్మునన్ ప్రభవించినట్టి
శరము భార్గవరాముపై శక్తిజూప
వదలె శ్రీరాముడుగ్రుడై - పరశురాము
భావమే మారిపోవ సత్యమ్ము తరుగ

"బ్రాహ్మణోచితమైనట్టి వ్రతము బూని
అరుగుచున్నాడ - నీవు విష్ణ్వంశజుడవు
పరశువును వదలివైచితి; భద్రమగును
నీకు లోకాన - విజయమ్ము నీది రామ"

అనుచు భార్గవరాము డయ్యవసరమున
అరిగె తపమొనరింపగ నడవికైవు
ఆకసమ్మున సురగణ మభినుతించి
కుసుమ వర్షమ్ము కురిపించె కూర్మితోడ



ఇది బాలకాండ రాముని
పదములు స్మరియించి యెట్లో పలికితి - ప్రజ్ఞా
హృదయులు పాఠకులెల్లరు
సదయులు మీ కృపయె నాకు శక్తి నొసంగున్

కింకరుడను శారదకున్
పంకేరుహనయన రామపాద ద్వయికిన్
వేంకట శేషాచార్యుడ
సంకల్పము కలిగె రామచరితము వ్రాయన్

సూత్రమువైఖానసమై
గోత్రమ్మాత్రేయ మగుచు కూడగ; నిత్య
స్తోత్ర మొనర్చుచు రాముని
పాత్రుడనై నాడ మహిత పండిత కృపకున్

# శ్రీ మద్రామాయణ కల్పతరువు

## అయోధ్యా కాండ

మేనమామ యుధాజిత్తు మిక్కుటముగు
పుత్రలోప దుఃఖమ్మున మునిగి యుండి
భరత శత్రుఘ్నులను వారి బంపుడనుచు
దశరథేశుని గోరెను దయ దలిర్ప

వాని కోర్కెను మన్నించి ప్రభువు పేర్మి
భరత శత్రుఘ్ను లిరువుర బంపె నటకు
సోదరులు మేనమామను జూడ జనిరి
పరమ సంతోష భావాన బయలుదేరి

రామచంద్రుడు ప్రథిత పరాక్రమమున
యుద్ధభూమిని నోడించి శుద్ధమతిగ
వైరివీరుల గెల్చి శోభన్వహించె
ధన కనకహార వాహన తతుల తోడ

దానధర్మాలు జేసియు ధరణి సురల
దీవనల్ పొంది రాముండు తేజరిల్ల
దశరథేశుడానంద వర్ధనుని తనయు
గని ముదమ్మున రాజ్యపాలన మొనర్చె

ముద్దుకొమరుని యొకనాడు ముదము మీర
దశరధుడు కోరి కోరి చెంతకును చేరి
వృద్ధదశ వచ్చె కొమరుడ! వేయియేల!
పాలన మొనర్పు మీవని పలుకదొడగె

సూర్యబింబంబు నందున చూడ్కి నిలుప
మధ్య ఛిద్రంబు గాన్పించె మదియు చెదరె
ధ్రువుడు దృష్టికి గన్పించడవుర! వీని
ఫలితమెన్నగ ఘోర దుష్ఫలిత మనుచు

ప్రభువరేణ్యు డమాత్యుల ప్రశ్న జేసె
బుద్ధిమంతులు మీరు విశుద్ధమతులు
రామచంద్రుని యిప్పుడే రాజు జేయ
భావమేర్పడె మీ అభిప్రాయ మేమి?

సంతసించి వారందరు సబబె యనిరి
ప్రభువరేణ్యుడు గురువును భక్తి - పిలిచి
చరణ సన్నిధి వ్రాలియు శిరము వంచి
తనకు గల్గినయట్టి యోచనను వినిచి -

దయదలిర్పగ తాము తథ్యమనిన
నిశ్చయింపుడు మూర్త మీనిముస మందె
అనుచు ప్రార్థించె నరపతి; - అపుడు వినిన
కులగురువు మెచ్చి మధురవాక్కులు వచించె

పుష్యమీయుక్తమైనట్టి మూర్తమొకటి
మీకు - శ్రీరామ పట్టాభిషేకమునకు
మూడురోజుల లోపల కూడి వచ్చె!
జ్యేష్ఠ పుత్రుడు రాజౌట శ్రేష్టమయ్య

మోహనాకారు శ్రీరాము ముదమున గని
రాజ్య భారంబు వహింపరా! కుమార!
ప్రజలు మెచ్చిరి మిక్కిలి పరవశమున,
అనుచు తెలిపెను దశరథుండాదరమున

వాడవాడల నన్నింటిని బాగుపరచి -
పచ్చకర్పూర శకలముల్ మెచ్చునటుల
కలయ జల్లించి - వీధివీధులను చేలి
ముత్యముల మాల లమరించి - మోదము గనిరి;

పట్టణంబెల్ల శృంగార భరితమాయె
రాము పట్టాభిషేకంబు ప్రేమ మీర
జరుప ప్రజలెల్ల పారవశ్యమున దేలి
యాడు చున్నార లానంద మందుకొనుచు

కైక దాసి - మంధర జూచి కలత పడుచు
రాణితో జెప్పె మనసున రభస జెంది
స్వర్గసీమగ కనిపించె సర్వమిచట
మన అయోధ్య సమస్తము మారె దేవి!

ఇంత జరుగుచు నున్నను నుంతయైన
తెలియదాయెను విషయమ్ము - తెలియుమింక
కపటబుద్ధి నీ నాథుండు కరుణ వదలి
చేయు కార్యంబు తెలియంగ జెప్పుదాన

ఏమి యింతగా నీ విటులేవగింప
బోవు ముందుగ చెప్పుము ముఖ్యముగను
వింతయేమైన గంటివే! వివరముగను
తెల్పుమన కైక; మంధర తెలిపె నిట్లు

జ్యేష్ఠ తనయుని శ్రీరాము శ్రేష్ఠుడనుచు
యావ రాజ్యాభిషేకంబు నభిలషించి
సలుప దలపెట్టె దశరథేశ్వరుడు నేడు
ప్రజలు సంతోషమున పరవశులు గాగ

అది వినిన కైక యెంతయో ముదము నంది
రామ పట్టాభిషేకంబు రాజు సలుప
కర్ణ పేయమ్ముగా వినగల్గు టొకటె
తనకు ముఖ్యమటంచు మంథరకు జెప్పె

మధుర తరమైన వార్తను మాకు జెప్పి
సందులకు సూర్యహారమ్ము నందుకొనవె
మంథరా! యని ఒసగెను మమత తోడ
కైక, దాసికి - ఆమె బిగ్గరగ నవ్వె

రాజ్యభారంబు వహియించి రాజవీర
మధి వసించెడి శ్రీరాము నాత్మ నెంచి
పొంగుచుంటిని నా మనమ్మున నటంచు
మెచ్చుకొనె కైక మంథరన్ మేలటంచు

కైక మాటలు వినగనే కలతజెంది
కోపమొందియు మంథర క్రూర యగుచు
సంతసంబంద తరుణమా! చాలు చాలు
మానుమిక కైక యనుచును మందలించె

నీ మనోనాథు ప్రేమయు నీకు తెలిసె
నింత కాలంబునకు చాలు పంతమేల
పట్టభద్రుని గావించు పలుకునైన
నీ చెవిన వేసెనే! రాజు నిశ్చయముగ

ప్రేమ యెంతయొ తెలిసెను ప్రియుడటంచు
దశరథుని మాట పలుకంగ తగదు నీకు
రాము తల్లి కౌసల్యయె రాజమాత
నీవు - నీ బిడ్డ - వానికి, సేవకులిక

పిచ్చిదానివి పాపము ప్రేమతోడ
పెంచినావు రాముని మీద ప్రేమతోడ
కడకు వానికి దాసివై గడపవలయు
తనయుతో గూడ నీ జీవితమ్ము నెల్ల

వినిన కైకమ్మ గుండెలో విరిసె తాప
మపుడె! విషమయమై హృదయమ్ము మండె
మంథరా! మేలు; సమయాన మంచిమాట
తెలిపితివటంచు కైక తాపలుక దొడగ

సంతసించిన మంథర చనువు తోడ
రాణికిని జెప్పె నపుడనురక్తి గదుర
తొలుత మీ తండ్రి నీదు పుత్రునికె రాజ్య
మీయ గోరెను మరచితే! యీ విషయము

శంబరాసుర యుద్ధంబు జరుగునపుడు
చక్రరక్షణ జేసియు సాయపడిన
తరుణమున - యిచ్చె వరములు దశరథుండు
మరచినావేమొ! జరిగిన చరితమెల్ల

నాటి వరముల రెంటి నీనాడు కోరి
రాము నడవికి బంపుము - ప్రేమ మీర
భరతుచే రాజ్య మేలింప పట్టుబట్టు
మిట్లు రెండు వరాలు ఫలింపనిమ్ము

పదియు నాల్గేండ్లు రాముడు వనికి నేగ
భరతుడేలును రాజ్యము భద్రముగను
కార్యమిది సంశయమ్మిక గలుగనేల
అనుచు బోధించె మంథర - అనునయించి

దైవ వశమున రాణికి తరిగె బుద్ధి -
మనసు మారెను - మాటలు వినగ వినగ
విభుడు కోపించకుండెడి విధము నెరుగ
జెప్పుమని కోరె కైక - దాసియు వచించె

ధైర్య మూనుము మాయమ్మ తడయ నేల
కార్యదీక్షను సాధించి కనుము ముదము
మనసు చెదరక నుండుమా! మాన్య చరిత!
పట్టు వదలకు యేమైన - బెట్టు విడకు

అలక గృహమున చేరుమా - అయ్యగారు
వచ్చి పిలిచిన పలుకకు వగవ నేల?
భయము జెందక సంబరపడుము తల్లి!
జాగు సేయక వేగమ్మ సాగుమింక

పలుకు పలుకకు - వచ్చిన పతిని జూచి
భయము భక్తియు పాటింప వలదు వలదు
భూషణాలెల్ల దీసి - అబ్బురము గొలుప
వగచుచున్నట్లు నటియింప వలయునమ్మ!

దాసి చెప్పిన బోధతో తరుణియపుడు
కోప గృహమున జేరెను క్రోధమూని
దశరధుని రాక కొరకయి తరుణి కైక
ఎదురు జూచుచు నుండెను ముదము మీర -

దశరథేశుడు ప్రేమతో తనయు జూచి
తండ్రి కోర్కెను చెల్లించు తరుణమయ్యె!
రాజ్య భారంబు వహియించి రామభద్ర!
బుధుల కోర్కెను దీర్పు మపూర్వముగను

అనుచు పలికెను సంతోష మతిశయింప
ఆజ్ఞ చేసె వశిష్ఠుడయ్యవసరమున
దీక్ష వహియింపు మో రామ' దేవ! వేగ
పట్టభద్రుడ వీవు గావలయునంచు -

గురువు శాసింప రాముడు కూర్మి మీర
దేవ గృహమున పూజలు దీక్షతోడ
జేయుచుండెను గురువులు చెప్పినట్లు
జరుగబోయెడి - అభిషేక సమయమెంచి

దశరథేశుడు ముదమున, ధర్మ మనుచు
ముద్దు భార్యను దరిజేరి ముచ్చటగను
రామ పట్టాభిషేక వార్తను వచింప
సంతసమ్మున కైకమ్మ చెంతకరిగె

ఎదురు రాదాయె కైకమ్మ యేమి వింత?
మనసునందున సందేహమా! జనించె
వెదకె గృహమున చివరకు విసుగు జెంది
అలక గృహమున గనియె నయ్యతిన నపుడు

భూమిపై శయనింపగ బాధ యేల?
పట్టెమంచము పరుపులు పాన్పులుండ
బాధ లేవైన గలిగెనా? భామ! చెపుమ
ఘనుల వైద్యుల బిలిచెద కలత యేల?

భూతమేమైన సోకెనా పొలతి చెపుమ
భూతవైద్యుల రప్పింతు ముదము మీర
ఎగ్గు సేసిరె! యెవరైన నెరుగ దెల్పు
మట్టి కుమతుల శిక్షింతుననుచు బలికె

ధరణి పతియును కాంతదగ్గరకు జేరి
కనికరించుము పడతి! నా కలుషమున్న
ప్రేమ జూపుము నామీద ప్రియ! అటంచు
పలికె మురియించునట్టి మాటలు వచించి

భద్రమూర్తిని శ్రీరాము ప్రాణసముని
పట్టభద్రుని జేయంగ ప్రజలు మెచ్చ
నీకు సమ్మత మీ శుభ నిర్ణయమ్ము
కావునన్ వినిపింప నుత్కంఠ గలిగె

బ్రతిమలాడెను కరములుబట్టి సతిని
తేనెబూసినవాడి కత్తిగ నెరుంగ
లేక ప్రభువు - వినిర్మల రీతి - కైక
నాదరమ్మున - ఆమె అనాదరించి

పుడమి వల్లభు జూచియు పొలతి కసరి
నన్ను నమ్మించి మోసమొనర్చినావు
ప్రేమ నాపయి నీకున్న నా మనస్సు
నెరుగకుందువె! యని వచియించెనపుడు

మోసమేమియు లేదిట ముదిత! వినుము!
ఆశితప్పాట యెరుగ నీవాగ్రహించి
సూర్యవంశమునన్ వ్రేలెత్తి చూపదగునె?
శుద్ధ మనమున పరికించి చూడుమింక

కోర్కె యేమైన గలదేని కోరుమిపుడు
తీర్చెదనటంచు బలికె పృథ్వీ విభుండు
క్రొత్త కోరిక యేటికి? - కోరియుంటి -
సాగుతరి దేవదానవ సమర రీతి

ఇప్పుడా రెండు వరముల నివ్వవలయు
భరతునిన్ పెద్దగా నిల్పి ప్రభువు జేసి
రామునిన్ బంపవలయు నరణ్యములకు
నల్లె పదునాలుగేండ్లుండ వచట నతడు

కైక పలుకుల ములుకు లాగ్రహము గూర్ప
దశరథేశుడు వినగనె దద్దరిల్లి
హాస్యమాడుట కిప్పుడె అదును గలిగె
నేమి? కైకా! యటంచనె - ఎంతొ కుమిలి

గోరుముద్దలు పెట్టియు గొప్ప పేర్మి
చూపితివి రాముపైన - నేపాప ఫలమొ!
నేడరణ్యాలపాల్ జేయ నీకు మనసు
గలిగెనా! కైక! యేనాటి కర్మ యిద్ది?

రామచంద్రుడు లేనిదే రాజ్యమెల్ల
శూన్యమైపోవు - నగరంబు శోభవీడు -
బ్రతుకు లేదింక నాకును ప్రాపులేదు
కుక్కచింపిన విస్తరి దక్కునట్లు

ప్రాణనాథుని జూచియు పలికె రాణి
మున్నొసంగిన వరములీకున్న రాజ!
ఈయనని చెప్పుమింక నేమేలనయ్య
భర్తనని నమ్మి మోసమ్ము పడితి నేడు

ముదిత మాటలు విని రాజు మూర్ఛచెంది
తెప్పరిల్లియు కన్నులు తెరచి మెల్లో
పట్టు విడువుమటంచును బ్రతిమలాడ
కన్నులెఱ్ఱంగ జేసెను కైక వినక

రాజు మంత్రిని పిలిచి - వరాల తండ్రి
యైన రాముని రప్పింపుమనుచు పలికె
అవనిపతి యాజ్ఞను సుమంతుడాచరించె
వచ్చె రాముడు కైకమ్మ భవనమునకు

భూమిపై పడియున్నట్టి పుణ్యమూర్తి
తండ్రి గనుగొని జనకు పాదములు ముట్టి
ప్రణుతి గావించి విషయ వివరణ సల్పు
మనుచు గోరెను కన్నీటి కణములురల

తల్లివంకకు జూచి మాతా! విచిత్ర
మీ పరిస్థితి - జనకునకేమి జరిగె?
కనుల నీర్వెట్టుటకు తగు కారణంబు
నీవయిన జెప్పుమమ్మ! మన్నించి - అనియె

తలను విరబోసుకొని యొక దయ్యమట్లు
వెఱ్ఱిగానవె కైక ఆవేశపడుచు
వరములన్ రెంటినిడుటకు వలను పడక
మాట నెగ్గించలేడయ్య! మనుజ విభుడు

మున్నొకప్పుడు సంగరమున మదీయ
మైన సహాకారమున్ గొనినట్టి ప్రభువు
మెచ్చిన వరమ్ములన్ రెంటి నిచ్చువేళ
వెనుక ముందాడుచున్నాడు వేయియేల?

నాడొసంగిన వరము లీనాటివరకు
దాచి యడిగిన కాదనె దశరథుండు
మాటదప్పెను - గౌరవమా! కుమార!
ప్రభువులకు నిజము పలుకుటే ప్రాణమయ్య!

విషయమంతయు వరుసగ వివరణమ్ము
సలిపె కైకకమ్మ - పిమ్మట పలికెనిట్లు
నాయనా! రామ! కొమరుని శ్రేయమునకు
భంగమేర్పడెనని యిట్లు బాధజెందె

కొమరుడన భరతుడుగూడ కొమరుడెకద!
రాజ్య మెవరేలుకొన్న యీ రాజు బాధ
పడుట న్యాయమె! వరములనిడుట ధర్మ
మనుచు నీవైన వివరింపుమయ్య! యింక

నిజము నిజమమ్మ యిప్పుడు నీవు పలికి
నట్టివెల్లను - భరత పట్టాభిషేక
మభిమతము నాకు జనకునియందసత్య
దోషముంచుట నాకసంతుష్టి తల్లి!

అనుచు పలుకుచు రాముడత్యాదరమున
కైక కడనాజ్ఞ గొనియె సుశ్లోకుడగుచు
తండ్రికిని మ్రొక్కి పితృవాక్య ధర్మనిర్వ
హణకు సాగెను సంబర మతిశయింప

అరిగె కౌసల్యచెంతకు జరిగినట్టి
వెల్ల వినిపించె - గుండె గుభిల్లుమనగ -
పిడుగు శిరమున బడినట్లు బెదరిపోయి
వెఱ్ఱిబట్టిన యట్లామె వివశగాగ

అమ్మ! నాయనగారి వాక్యమ్ము సత్య
సమ్మతమ్ముగ జరుగుట సముచితమ్ము
నీవు విలపింపవలదమ్మ! నావలననె
అనృత దోషమ్ము జనకున కంటరాదు

ఈ ధరణినేలు పదునాలుగేండ్లు భరతు
డింతలో నేనువచ్చి నీకిడెద సంత
సమ్ము సెలవిమ్ము - జననీ! నా తమ్ముడయిన
నేనయినగాని నీకు సమానమమ్మ

కావునన్ దీవనలనిచ్చి కార్యదీక్ష
గలుగజేయుము జననీ! నాకల ఫలించు
జనకుని ఋణమ్ము దీర్చుకో జాలుదనుచు
పలికె శ్రీరాముడానంద భరితుడగుచు

భారతీదేవి వాక్పతి భాస్కరుండు
శశియు లక్ష్మీశుడున్ మహాశంకరుండు
కరుణజూపుచు తనయుని గాచుగాక
అనుచు కౌసల్య దీవించె నశ్రువులతో!

## వనములకు శ్రీరాముడు పయనమగుట

తల్లిఆజ్ఞను గైకొని తరలె రాము
డంత నర్ధాంగి కడకు నత్యాదరమున
ఉన్న విషయమ్ము వివరించి - ఊరటను ఘ
టించి - దీక్షనుబట్టి నెగ్గించుకొరకు

వినిన సీతమ్మ అప్పుడీ విధమ గ ననె
నేను వచ్చెద మీవెంట కాననలకు
సేవజేయుదు మీకు నాచి త్తమలర
కాదనకుడంచు ప్రార్థించె కరము మోడ్చి

ప్రేమమీరంగ ననియెను రామమూర్తి
కాననంబుల నుండుట కష్టతరము
క్రూరమృగములు బాధించు సారసాక్షి
వలదు నీకిట్టి వాంఛయే వలదు వలదు

ఇంటనుండియు మాఅమ్మ కింపుగదుర
సేవచేయుట ఉచితంబు సీత! నీకు
నాదు వెంటను రారాదు నళిననేత్ర!
అనగ దుఃఖము నందుచు ననియె నిట్లు

ధవుని సేవించుకొరకయి తరుణికెపుడు
ఇంటనో! - కాననమ్ముల వెంటనైన
ఛాయ మాదిరి వెడలుట సవ్యమనెడి
బుధవరేణ్యులు చెప్పెడి బోధ వినవె!

పురుష పుంగవులందున పూజ్యుడవని
అప్పగించెను మా తండ్రి గొప్పదలచి
అపయశంబును ఘటియించునట్లు నేడు
వీడి నన్నిట మీరేమొ! వెడలరాదు

సతి కుతూహలమున్ గని పతి ముదమ్ము
నంది అంగీకరించె; ఆనందమందె
సీత - వారిరువురు నారచీరలను ధ
రించిరప్పుడు కోరి వహించి దీక్ష

తమ్ముడగు లక్ష్మణుండు - విధమ్ము నెల్ల
తెలిసికొనివచ్చి కైకపై అలిగి - ఆమె
పైకి దుముకగబోయి పాపమ్మటంచు
రాముడన వెనుదిరిగి ప్రార్థన మొనర్చె

అన్న యేమైననేమి నాకనవసరము
నిన్ను వెన్నంటి వచ్చుట నీతి నాకు
నన్ను గొనిపొమ్ము ప్రేమతో నిన్ను గొలుచు
కొనుచు వనముల నుండెదననుచు బలికె

రాముడా మాటలను విని లక్ష్మణునకు
నచ్చజెప్పగ బూనుచు హెచ్చరించె
తండ్రి ముదుసలి గనుక చెంతనె వసించి
సేవసల్పు మటంచును చెప్పిచూచె

వినడు లక్ష్మణుడెంతకు విసిగిపోయి
రాముడంగీకరించెను ప్రేమ గదుర
జననియైన సుమిత్రయు సమ్మతించె
లక్ష్మణుడు జేరె సీతతో రాముతోడ

దశరథేశునిగా రాముదలచు మెపుడు
నన్నుగాదలచు మా సీత నెన్నడేని
నడవినెప్పుడు భావింపుమా! అయోధ్య
యనుచు సుఖముగ వెళ్ళిరమ్మయ్య! పుత్ర!

తల్లిదండ్రుల రీతిగా తలచుమెపుడు
సీతకున్ రామునకు పాదసేవ సలిపి
సకలసిద్ధులు సమకూరు సౌఖ్యమబ్బు
ననుచు బలికె సుమిత్ర లక్ష్మణుని తోడ

బుద్ధిమంతుడవై నీవు ముచ్చటగను
పానభోజన శయనాది పథములందు
కనుగలిగి అన్న సేవలో గణనకెక్కి
యిలను పేరొంది మోక్షైక ఫలము గనుము!

ఊర్మిళకు నచ్చజెప్పి - తానొంటరి గనె
అన్నతో పయనమాయె నత్యంత భక్తి
భావమున లక్ష్మణుండు ప్రసన్నుడగుచు
స్వార్జితంబగు పుణ్యంబు సఫలమొంద!

సున్నితములైన పాదాలు సొక్కిపోవ
వనములందున రాముడు వనజ ముఖియు
లక్ష్మణుడు సంచరించుట రాక్షసమ్మె
విధిని తప్పింపనెవ్వరు విధమెఱుగరు

గుంపుగాగూడి ప్రజలెల్ల గొల్లుమంచు
రోద నంబందిరానాడు క్రోధ మెసగ
గంపగయ్యాళి కైకమ్మ కఠిన చిత్త
మెంత జేసె సుమా! యని యెడద పగుల

నారవసనాల నందించె నాతి కైక
అందుకొనియెను రాముడత్యధిక భక్తి
భూమిజ కొసంగబోవగ భూమి పతియు
కుమిలిపోవుచు పటపట గొరికె పండ్లు

వృద్ధరాజుకు భరతుని విభు నొనర్ప
నర్హతయె లేదు సత్యము నరసి చూడ
చీల్చి చెండాడెదిప్పుడే చిక్కు దీరు
ననుచు కైకను జేరె లక్ష్మణుడు వేగ

శాంతమూనుము తమ్ముడా! సౌమ్యరీతి
తల్లితండ్రియు గురువులు ధరణి పతులు
పూజకర్హులు - నిందింప బూనదగదు
విడువుమా! కోపమనుచు రాముడు వచించె

అడ్డమగు వారినెల్లర హతమొనర్చు
కాననంబులకేగుట గాదు - నేడు
కైకవధ సల్పుటొక్కటే కార్యమనుచు
పరుషముగ మాటలాడు సోదరుని గాంచి

తండ్రి ఆజ్ఞను మీరంగ తగదటంచు
తమ్మునిన్ శాంతపరచెను ధర్మమూర్తి
అయిన శ్రీరామమూర్తి-సూర్యాన్వయమున
కెట్టి అపయశమును లభియించనట్లు

తమ్మునోదార్చి రాముండు తరలుచుండె
దశరథేశుడు దుఃఖాగ్ని దగ్ధుడగుచు
భూమిపై పొరలుచుండె - రాముడును తండ్రి
పాదములపైన వ్రాలె సద్భక్తి గదుర

రామలక్ష్మణ సీతలు రథమునెక్క
సూతుడెక్కెను నెగులుతో సూత్ర మంది
అశ్వముల నదలింపగ, నాత్రపడుచు
రాజు కనుగొని కన్నులరాల్చె నీరు

పోకు! పోకుమా! రఘురామ! పోకు తండ్రి
కొంతతడవుండి కదలు మా కోర్కె తీరు
నేను వచ్చెద మీ వెంట నిర్మలముగ
ననుచు భూవిభుండార్తితో ననుచు నుండె

రథము వెంటనె పరుగిడె రాజు లేచి
చేతులెత్తియు ప్రార్థించె సిగ్గువిడిచి
కొంచెమాపు సుమంత! నా కొమరు చూచు
కొనెద ననుచును ప్రేమ భావన తపింప

రామలక్ష్మణ సీతలు రాజు గనగ
దుఃఖమొదవెను వారికి మిక్కుటముగ
జలకణంబులు వర్షించె జనులుజూడ
వేగ వెడలుమా! సుమంత విభునిగాంచకు

ఆలసించిన మా తండ్రి హానినందు
వ్యవధి జూపక పోయిన వ్యథ నశించు
నాదు మాటను వినుకొని కాదనకుము
కదలుమని రాముడానతిగాగ పలికె

మోహనుండగు శ్రీరామమూర్తి లేక
నగరమున నుండుటెట్లని వగచి వగచి
పురజనులు వెంటబరువిడ పురమువీడి
సాగిపోయెను రథమహో! వేగిరముగ

ఇచటనుండిన మనకిక యింపు లేదు
పాడుపడినట్టి నగరమున్ పాపి కైక
యేలుకొనునిక స్వేచ్ఛగా నెదురులేక
రాము వెంటనె జనుట కర్తవ్యమనుచు

వేదవిదులెల్ల వెంటనే వివిధ గతుల
నగ్నిహోత్రాల సంచుల నందుకొనుచు
వేదములను జపించుచు వేగముగను
రథము వెంటను సాగిరత్యధిక భక్తి

సరయూ తీరంబునకు చేరెనరదమపుడు
పెద్దలెల్లర వీక్షించి ప్రియము మీర
రామమూర్తి వచించెను ప్రేమతోడ
గృహములకు నేగుడనుచును కృప వహించి

త్వరగ వత్తును కాననాల్ తిరిగి నేను
నగరవాసులు మీరలు; నిగమ వరులు
కష్టపడుచుండ చూచుట కిష్టపడను
మరలి గృహముల కేగుడీ - మాట వినుడు

ప్రజలవెల్లర వీక్షించి భద్రి మొదవ -
ఇనకులేశుడు రాముడిట్లనగ వినిన
వారు కైకమ్మ పాలన వలదు బాబు!
మిమ్ము విడిపోవమనిరి, క్షమించమనిరి

రాముడిక చేయునదిలేక - ప్రేమ పీడ
లేక - కష్టాలు చూడగాలేక వారి
నెట్లయిన - పంపవలెనిక యింటికనుచు
తలచి నిద్రించుడనుచును పలికెనంత

నిదురలేచిన ప్రజలింక కదలనీయ
రనుచు భావించి - రాము డయ్యర్ధరాత్రి
వేళ మంత్రినిలేపి - ఆ విధముచెప్పి
నడవిబాటల రాముని యరదమరిగె

కనులు తెరచిన సమయాన కానిపించ
దాయెను రథమ్ము - రాముని యరదమనిన
పురమునకు చేరియుండులే మరలుడనుచు
మరలినార లయోధ్యపై మనసు నిల్పి

జహ్ను మునిపేడు కతననే జాహ్నవియని
పిలువబడు గంగ - జేరి ప్రియము గదుర
తెల్లవారు నరికిని సుదీర్ఘయాన
మున నలసిపోయి - కర్తవ్యమును మరువక

మంత్రి సత్తమ! శ్రమియించి మమతజూపి
గంగ దరిజేర్చినాడవు కరుణతోడ
మరల వత్తుము త్వరగనే మరలి నీవు
నగరమున కరుగమని పల్కినారు వారు

## గుహుని భక్తి

మోహనా కృతిగల రాము మోముజూచి
వచ్చెను గుహుండు భక్తి భావమున నటకు
ప్రణుతి గావించి స్వామి - నా వ్రతము పండె
ననుచు తన సేవలంద రండనుచు పిలిచె

గుహుని సేవల కలరి - భక్తుని యనుగ్ర
హించి - తనవారికాతిథ్య మీయు మనుచు
పలికి వారేమి ముట్టక వదలుకొనిరి
ఆ సుమంత్రుడు నిట్టూర్పు లందుచుండ

ఓ సుమంతుడ! యింక నయోధ్య కరుగ
వచ్చుననుచును మేమింక వత్తుమనుచు
పలికి ముదమున వానిని పయనమునకు
సిద్ధపరచెను రాముడచ్చెరువు గదుర
తండ్రి కానంద మొదవింపదగినవాడ
వీవటంచును పలికె - నీవెల్లా! జనకు
నూరడింపుము ప్రబల విచార భార
ముడుగజేయు మటంచు రాముడు వచించె

ఉదయమే గంగ దాటింప నొప్పుకొనిన
గుహుడు రాముని జేరి మ్రొక్కుచు: మహాత్మ!
మీదు పాదాలు కడిగినమీద నావ
పయిన నెక్కించుకొనెద సంబరముతోడ

మున్ను నీ పాదధూళికి ముదితయగుచు
శిలయె మారినమాట విచిత్రమయ్య!
కాననిట్లొనరింపగ కరుణజూపి
ఆజ్ఞ నిడుమంచు ప్రార్థించె నాదరమున

నావయే జీవనంబయ్యె నాకు సామి
కొయ్య కాంతగ మారిన గొడవవచ్చు
జీవిత సుఖమ్మునకుగూడ చేటుగలుగు
కాళ్ళు బాగుగ కడగక - కదలనయ్య!

పదములందించె సంబరపడుచు రాము
డా గుహున కాతడేమొ! బాగోగులరసి
మురికి బోవగ కడుగుచు మురియ దొడగె
భక్తి భావమ్ము ప్రబలమై పరవశింప

సారహీనంబు సంసార సాగరంబు
దరినిగంటిని నేనింక ధన్యతముడ
పుష్ప గుచ్ఛాల పూజింతు పుణ్యమూర్తి
ననుచు రాముని ప్రార్థించె నా గుహుండు

రామనామంబు సల్పుచు రక్తిజూపి
నదిని దాటించెనప్పుడు సదయ హృదయు
ప్రస్తుతించిరి అందరు ప్రబలముగను
జాహ్నవిని దాటె రాముడు సఫలతగని

గుహుని వీడ్కొని రాముడు గురుతరమగు
కార్యభారమ్ము వహియించె ధైర్యమూని
నారచీరలు పేర్మితో ధారణమ్ము -
సలిపి సాగిరి మునుల ఆశ్రమము వంక

అట నయోధ్యా పురంబు నందవని పతియు
చెంత జేరిన వారితో చెప్పదొడగె
ఇది మహా శాపఫలము నేనింతవరకు
మీ కెరింగింపనైతి సుమీ! నిజమ్ము!

మునివరుండిచ్చె శాపమున్ కనలి నాకు
కారణమ్మెరిగించెద గాన వినుడు
దాచితిని నేటివరకిల్లె తప్పలేదు
ప్రబల శాపమటంచును పలుకదొడగె

శబ్దవేది మంత్రంబుచే చప్పుడు విని
మాటుబెట్టియు బాణాలు సూటివిడువ
క్రూరమృగ జాతులెల్లను కూలుచుండె
కాలమా! సాగుచుండె నక్కరణినపుడు

వృద్ధులగు తల్లిదండ్రుల వేడ్కమీర
కావడిన్ బెట్టి మోసెడి కన్నబిడ్డ
జలము గొనిదెచ్చుటకు వచ్చి సలిపె శబ్ద
మా ధ్వనిని విని మృగరాజమని తలంచి

శరము వదలితి నది కూల్చె సాధుపుత్రు
కేక వైచెను - వింటిని - కేలనున్న
బాణమును భూమిపైనిడి భ్రాంతి యెంతో!
నందినాడ నాపయి చేయునట్టిదేమి?

అంధులైనట్టి వారి దాహమ్ము దీర్ప
వచ్చి తనువును వీడెను వంద్యుడైన
మునికుమారుండు - కథజెప్ప కనులనుండి
బాష్ప కణములు పొరలె స్తబ్ధతయు గలిగె

నీరుగొని వారికడకేగి నిలిచినాడ
విషయమును విషదించుచు - విస్తుపోయి
వారలనిరి మావలె నీవు బాధలందు
మయ్య! కొమరులు దరిలేని అదనునందు

వారి శాప ప్రభావమ్ము వలన రామ
చంద్రుడిచ్చట లేనట్టి సమయమందు
వచ్చె నీస్థితి దీనికి వగవనేల?
అనుభవింపగ వలదె స్వయం కృతమ్ము

రాజు పలుకులు వినినట్టి రాజులెల్ల
కనుల నీరిడుచుండిరి - వనములందు
బాధలందెడి రాముని భావనమ్ము
మదిని కలగింప, గళమున మాటరాక

శాపమిడినారు వృద్ధులు చనిరి దివికి
నాడు జేసిన పాపమీనాడు కట్టె
కుడుపబూనెను విధినెదుర్కొనగ తరమె
చక్రవర్తులకైన నాశ్చర్యమేల?

రామరామా! యటంచును ప్రేమతోడ
తనయు దలచుచు నేడ్చుచు దశరథుండు
కనులు మూసెను - వైరాగ్యమును వహించి
భార్యలెల్లరు గగ్గోలు పడుచునుండ

మంత్రివరులెల్ల కౌసల్య మందిరమున
జేరి పరిణామములు సమీక్షించినారు
తైలమున రాజు తనువుంచి - త్వరిత గతిని
భరత శత్రుఘ్నులకు వార్త బంపినారు

కులగురుండు వశిష్ఠుండు కోవిదుండు
సముచితమ్ముగ నూహించి - శక్తియుతుల
బుద్ధిమంతుల చారుల బోవబనిచె
తాతగారింట - గలవారి దగ్గరకును

భరతుడానాటి రాత్రి స్వప్నమున గాంచె
నూనెబూసిన యట్టి దేహాన రక్త
సిక్త వస్త్రమ్ములను ధరించిన జనకుని
రధము నుండియు భువిబడ్డ రాజునచట

ఇంతలో దూతలరు దెంచిరెట్లో! రాజ
మందిరమ్మునగల మేనమామల దరి
కరిగి కొనిపోవలెను సోదరులనిపుడె
మా పురంబున కనుచును మనవిజేయ

చెడ్డకలగని బాధతో చింతనందు
భరతునకు గుండె నిజముగ బ్రద్దలైన
యట్లు తోచెను - కడకేమియౌనో! అనుచు
మది కలతగన శత్రుఘ్నుడె మరచెనెల్ల

ఏల ఆలస్యమరుదెంచి యెరుగవచ్చు
గురువు వాక్యానుసారంబు, గోప్యముగను
వచ్చియుంటిమి పెక్కులు పలుకతగదు
చారులకు - మమ్ము మన్నించి సాగుడింక

అనుచు పలికెడి దూతల అభిమతమ్ము
కాదనగలేక సోదరుల్ కదలినారు
తాతయును మేనమామలు తత్తరపడ
ముందునకు సాగె వెంటనే స్యందనమ్ము

ముందు కైకమ్మగల గృహమ్మునకు జేరి
పాడుబడినట్లు మాసిన భవనముగని
చిటికెలో విషయమంత చిత్తమునకు
దెచ్చుకొని భరతుండు రోదించె మిగుల

తండ్రి తుది నిముసమ్మున తలచినట్టి
విషయమెద్ది యటంచును వివరముగను
తల్లినడుగగ అంత - పుత్రా! జనకుడు
రామ! రామా! అనెనటంచు రాణిచెప్పె

చెంతనే అన్న రాముడుచేరి యుండ
రామ! అని స్మరియింప కారణమదేమి?
దాచబోవకుమమ్మ సత్యము వచించి
వాస్తవమ్మును వివరింప వలయునమ్మ!

అనుచు భరతుడు కోపింప నంత కైక
జరిగిన విశేషములను సుస్పష్టముగను
పలికె - 'నాకేల యీరాజ్య భారమనుచు
నెంతపని జేసితనుచు వచించె' కొడుకు

రాక్షసివి నీవు - కొడుకును రాజుజేయ
పతిని హతమార్చి - రాముని పంపినావు
కానలకు - తీరులే కోర్కె కన్నకొడుకు
నైత మడవికిబోయి అచ్చట వసింప

ఇంత దుర్మార్గ హృదయమ్ము నింతకాల
మెట్లు దాచితివమ్మ! నీకితడు కొడుకు
గాడు రామునిబంటు - రక్కసి! సమస్త
రాజ్యమేలుము నీవె సలక్షణముగ

కుటిల భావాలతో కూడుకొనిన యట్టి
నాటకమునకు మంధర నటన మూల
కారణమ్మని భావించి కత్తినత్తి
దుమికె మంధరజంప శత్రుఘ్నుడపుడు

వలదని భరతుడడ్డుగ వచ్చి నిలిచె
స్త్రీని జంపుట పాపమ్ముగాన మరలు
మనుచు వారించె గుండెలు మండుచుండ
జననితో నిట్లు పలుకగసాగె కడకు

పెద్దబిడ్డకు రాదగు గద్దెమీద
నన్ను నిలబెట్టబూని - అన్నకు మహాప
కార మొనరించినావు - నీ కన్నకొడుకు
ననుచె నాకవమానమైనది నిజమ్ము

సంప్రదాయమ్ము మరచి వంశ ప్రతిష్ఠ
బుగ్గిపాల్జేసి - అన్నదమ్ముల మహాను
రాగలత తెగగోసి - సామ్రాజ్యకాంక్ష
దీర్చుకొనినావు - దాహమ్ము తీరినదియె?

నాకు వలదీ కసాయితనాన గెల్చు
కొనిన నీ పీఠపదవి - నాకోర్కె వినుము
హేతువేటికి పదునాలుగేండ్లు భరతు
డడవి నుండును రాముడయ్యవని నేలు

పలుకుచున్ భరతుడరిగె నిబ్బరము గదుర
సాధ్వి కౌసల్య వసియించు సదనమునకు
పదములన్బట్టి క్షమియింప ప్రార్థనమ్ము
సలిపె కన్నీరు వరదలై సాగుచుండ

తల్లి యిచ్చిన రాజ్యమ్ము నొల్లకిట్లు
వనములకు జేరనేల - రాముని అదృష్ట
మవ్విధమ్ముగ నున్న నీవెవ్విధముగ
మార్చగలవయ్య! భరత! యీ మాటలేల?

అపుడు కౌసల్య మాటలనాలకించి
పోటు మాటల పీడింప బూనకమ్మ
దైవసాక్షిగ నేనింక ధరణినేల
నమ్మమా! తల్లి నా వచనమ్ము నీవు!
తనయునోదార్చె! కౌసల్య కనులు తుడిచి
సంప్రదాయాను గుణముగ జరుగదగిన
సకల కార్యక్రమమ్ముల జరుపుమనుచు
చెప్పి చేయించె ప్రజలు జేజేలు పెట్టె
అంత పురజనులంద రత్యంత భక్తి
భరతునడిగిరి - అధికార పదమునంద
రాము చెంతకుచేరి యీరాజ్య భార
మప్పగించుమటె నాపని అనియె నతడు

## భ్రాతృ భక్తి

ప్రజలు గమనించి భరతుని పలుకులందు
వెలుగు ధర్మమ్మునకు మ్రొక్కి - ప్రేలువైచు
కొనిరి ముక్కున - భక్తితో కోరినారు
మమ్ము గొనిపొండు మీవెంట మాతృమనుచు
కరులు రథములు తురగముల్ కదలె - భరతు
డడుగు ముందుకు వేయ - నయ్యవసరమున
ప్రజలు భక్తిగ వెనువెంట పయనమైరి
రామనామమె ప్రతిగళసీమ పలుక
రొద యొనర్చుచు సైన్యము కదలిరాగ
ధ్వజ పతాకమ్ము లెగిరెను - తల్లులెల్ల
వెంబడించిరి - హితులు పవిత్ర హృదయు
లనుసరించిరి; రాముని గనుటకొరకు

బుద్ధిమంతుడు భరతుండు ముందు నడువ
సంతసించుచు ప్రజలెల్ల సాగ వెంట
రాము నాహ్వాన మొనరింప ప్రేమజూపు
సంఘముగ - సముచితోత్సాహ శక్తి పెరిగి

దూరముగవచ్చు వారల పారజూచి
బ్రతుకనీయడు కాబోలు వనమునందు
గూడ రాముని భరతుడు క్రూరచిత్త
మత్తు డింపెదనని — అభిమాని గుహుడు

భక్తితో వచ్చునెడల పుష్పాల పూజ
పదములకుజేసి భరతుని పంపగలను
కాక దుష్టాత్ముడై వచ్చుచో కరాళ
ఖడ్గరుచి చూచుననె మహోగ్రముగ నతడు!

ఇంతలో చెంతకున్ జేరి యిచ్చకోలది
భరతుడడిగెను గుహుని సంబరము గదుర
మీకు సేమమ్మె మీవారు మేలునందు
చున్నవారలె! వివరింపుమోయి! గుహుడ!

అనిన తలనూపి గుహుడనె - అబ్బురముగ
తమరెచటికేగ, నిచటికి తరలినారు
మీ యభిప్రాయమేమి! ఈ రేయి యెవరి
కొరకయి వెదకుచున్నార లెరుగజెపుడు

జ్యేష్ఠ పుత్రుడు రాజౌట శ్రేష్ఠమనుచు
మనమునందున యెంచి - అన్ననె అయోధ్య
కధిపతిన్ జేయ వచ్చితినయ్య! నేను
సత్యమిది రాముడొక్కడే స్వామి నాకు

భరతుడను మాటలను విని పరవశించి
గుహుడు - పొరబడినా ననుకొనెను - భరతు
పాదములుపట్టి క్షమియింపగను కోరె!
రామచంద్రుడు నన్నే దూరాన - నెచటా!

సీతతో వారు చేరిరి శృంగిబేర
పురమునకు గంగ దాటించి - పోవుటకును
వీలు కలిగించినాడ సంప్రీతితోడ
ననుచు గుహుడు వచించె నయమ్ము గదుర

పరమ భక్తుండు భరతుండు మురియునట్లు
పూజలర్పించె గుహుడహో పుణ్యశాలి!
ఫలములర్పించి ప్రార్థించి పంపెనంత
గంగ దాటించి గుండె ఉప్పొంగుచుండ

సర్వసైన్యాలు వెనువెంట సాగిరాగ
పావనంబైన జాహ్నవిన్ భక్తితోడ
ప్రస్తుతించుచు ముందుకు బయలుదేరె
భరతు డగ్రజుగనుగొన మురుసుకొనుచు

భరతుడేగ భరద్వాజ వర మునీంద్రు
నాశ్రమమునకు మరియు నత్యధిక భక్తి
మౌని పాదాలనంటి నమస్కరించి
ప్రార్థన మొనర్చువాడయి పలుకదొడగె

ఓ భరద్వాజ మౌని! అయోధ్య దైవ
మయిన శ్రీరామమూర్తి పితాజ్ఞ నిర్వ
హింప నడవికి జేరె - నేనిచట కన్న
నరయ వచ్చిన తమ్ముడనయ్య వినుడు

ఉత్తములు మీరు మాఅన్న ఉనికి దెలిపి
పుణ్యమున్ గట్టుకొనుడు - సౌజన్య ధనుని
రాముని వెంట గొనిపోయి, రాజ్యమునకు
దారను గావింపవలె - నన్ను భరతుడందు

ప్రార్థన మొనర్చు భరతుని పలుకులు విని
మురిసి అనెను భరద్వాజ మునివరుండు
భరత! నీ మనమునగల భ్రాతృ భక్తి
సంతసము గూర్చెనయ్య! ప్రశస్తమయ్య!

నీకు శుభమగుగాక! పున్నముల ప్రోవు
రామభద్రుడు - సీతయు - లక్ష్మణుండు
చిత్రకూటమ్ము చేరిరి శీఘ్రముగను
వారి గనుమయ్య! సుఖమున వరలుమయ్య!

సూర్యవంశ ప్రభావమౌదార్య రేఖ
కంటె నీకడ - యోగ్యతన్ గణనజేయు
తమ్ముడవు - నిక్కమన్నకు తగినవాడ
వన్నివిధముల పోయిరావయ్య! అనెను

ఆ భరద్వాజు ననుమతినంది, కదలె
సర్వసైన్య సమన్విత శక్తితోడ
చిత్రకూటమ్ము వంకకు, చిత్తమందు
నిలుపుకొని రాము - భరతుడు నిర్మలుండు

సోదరుడు లక్ష్మణుండట శుద్ధ హృదయు
డగుచు సేవింప దంపతు లాదరమున
స్థిమితముగ జూచుకొనుచు విచిత్రములను
చిత్రకూట నివాసమ్ము జేయుచుండ -

పరిధిత వైఖానసాచార పద్ధతిగను
భార్యతోడ వానప్రస్థ పరమదీక్ష
పూనియున్న (శ్రీ)రాముని పుణ్యమూర్తి
పరసి కన్నీరు నిడసాగె భరతుడంత

పరిబల దుఃఖమ్ము నుపశమింపగ నోనర్చి
నారచీరలు గనుచు మనమ్ము ఖేద
మనుభవించుచు నుండ - రాముని పవిత్ర
పాదసన్నిధి కరిగె నా భరతుడపుడు

భరతునిన్ గని క్రోధమ్ము పెరిగిపోవ
లక్ష్మణుండు వచించెను రామునితోడ
తల్లివలె దుష్టబుద్ధియై తరలివచ్చు
చుండె వానిపయిన్ దయజూపరాదు

అన్న! నీవాజ్ఞ యొసగిన మాత మొనర్తు
సర్వసేనా సమేతుడై సాగివచ్చు
వాని భరతుని - నీవిటువంటి వారి
పట్ల కనికరమును జూప వలదు వలదు

రాముడా మాటలను విని రాజ్యకాంక్ష
పెరిగి వచ్చెనో! వచ్చెనో! ప్రేమతోడ
తెలుసుకొనుటుచితమ్మని - తీవ్రదృష్టి
పనికిరాదని మృదువుగా పలికెనపుడు

ఆగ్రహమ్మాని సోదరా! అరుగతగదు
భరతుడెపుడును నాపట్ల భక్తిపరుడె!
రాజ్యమేలుట మాని వైరాగ్య సరళి
బూనెనా? పాపభావాన పూనుకొనెన?

తెలుసుకోనకయె దండింపవలను పడదు
ధర్మమిదిగాదు - నీవు వాస్తవము నెరిగి
వర్తిలన్ వలె - సకల శుభప్రదమ్ము
సహానమెప్పుడు - యిద్ది నిస్సంశయమ్ము

కోపమూనిన లక్ష్మణు కుదుటపరచి
భరతుజూడగ మదిని సంబరము పెరుగ
సీతతో రాముడెదురుగ ప్రీతిగదుర
నడువసాగె మహత్తరానంద గరిమ

వెంట జనుదెంచు వారిని వెనుక నిలిపి
భరత శత్రుఘ్ను లిరువురు భక్తితోడ
దర్శనాపేక్ష పెంపొంద ధ్యానమగ్ను
లగుచు సాగిరి రాముని కంజలింప

తనకెదురు వచ్చు పూజ్య సోదరుని గాంచి
పరవశించెడి భరత సోదరులు రామ
భద్రు పదముల తలనిడి - బావురుమని
కనుల నీరిడగడగిరా క్షణమునందు

తమ్ములను ప్రేమపూర్ణ మనమ్ముతోడ
నెత్తి బాష్పకణమ్ముల నొత్తి - రామ
చంద్రుడాలింగన మొనర్చి సముచితముగ
క్షేమ వృత్తాంత మరయుచు చేరదీసె

తమ్ముడా! తండ్రి సుఖముగ దనరువాడె
అమ్మలెల్లరు క్షేమమే అనుచు పలుక
తండ్రి మనకిక లేడిని తల్లడిల్లి
పాపమొనరించి నానని బావురుమనె

విషయమంతయు వినియును విజ్ఞుడయ్యు
తండ్రి మరణంబు నందెడి తరుణమందు
తాను దగ్గర లేకుంట తన అభాగ్య
మనుచు వాపోయె దౌర్భాగ్యమనుచు కుమిలె

సీతయును, లక్ష్మణుడును కృశించి క్రుంగి
పొంగి వచ్చెడి శోకమున్ మ్రింగలేక
వేదనకు గురియైరి - పవిత్ర హృదయు
డయిన దశరథునే మదియందు దలచి

క్రమము దప్పక పెద్దల గౌరవమున
పలుకరించెను రాముడు - వారి ఆజ్ఞ
మేరకున్ తండ్రి కొనరించె మిగుల భక్తి
తత్పరత్వముతోడ శ్రద్ధాంజలులను

తమ్మునిన్ జూచి రాముడాదరము మీర
భరతుడా! జరిగినదియేమొ! జరిగిపోయె
అమ్మపై నీవు పగబూనకయ్య! ఆమె
మనసునకు బాధగలిగింప జనదు నీకు

శిరము వంచెను భరతుడు - చెప్పినట్లె
చేయుదునటంచు - కాని! వేంచేయవలయు
నీవయోధ్యకు, రాజ్యమ్ము నీవెయేల
వలయునని పల్కె పాదముల్ పట్టి భక్తి

నీది రాజ్యము భరత! కనీస ధర్మ
మది యథార్థము - జనకుని ఆజ్ఞయద్ది
ఏ నడవిలోన పదునాలుగేండ్లు గడుపు
టదియు నిజము పితాజ్ఞయేయగు గదయ్య!

ధర్మహాని యొనర్చుట తగదు మనకు
సత్యనిష్ఠయె రాజ్యరక్షణ మొనర్చు,
ప్రజల కాపాడు - ప్రభువుల ప్రతిభ పెంచు
మంచి యేనాటికిని కూడ మారబోదు

రాముడీరీతి వచియింప - లక్ష్మణుండు
మౌనము వహింప - భరతుడు మాటరాక
చేయునది లేక - రాముని చిత్తవృత్తి
మార్చు మార్గమ్ము కనరాక మదిని కుమిలి

అచటి పెద్దలు భేషు భేషనగ - అన్న
పాదయుగముల పయిబడి భ్రాతృ భక్తి
భరిత హృదయమ్ము గంగయై పరవశింప
భరతుడిట్లనె శ్రీరామ భద్రుతోడ

నీవు రాకున్న నీ పాద నీరజముల
వదలిపోవుట జరుగదు - కదలుటన్న
మాటయే మాని ఉపవాస మహిత దీక్ష
నిచట వసియించువాడ నీ యిష్టమన్న

ఓయి! తమ్ముడ! నీకిది ఉచితమగునె!
ధర్మ మార్గమ్ము వీడుట తగునె! దీక్ష
మానుకొని రాజధానికి మరలుమయ్య
అనుచు రాముడు వెనుకకొక్కడుగు వైచె

జారెనప్పుడు శ్రీరామ చరణ కలిత
పాదుకాయుగళమ్ము - సంబరముతోడ
చేతజిక్కిన వానిని శిరమునందు
దాల్చి భరతుడు మురిసి నృత్యమ్మొనర్చె -

అన్న యీ పాదుకాద్వయినైన నేను
స్వీకరింప ననుగ్రహించినను చాలు
మాటకెదురాడబోవ నీ బాటయందె
పాదుకలొసఱ్చ నిక మీద పాలనమ్ము

పాదుకలకె సింహాసన ప్రాప్తి - చెంత
సేవకుడ నేను - నాకోర్కె యీ విధముగ
దీరుటయు ముచ్చటన్ గూర్చ - నారచీర
లట ధరించి సేవక ధర్మమాశ్రయింతు

నీవు వచ్చెడివరకునే నిలచియుండు
నంది గ్రామమ్మునను మహానందముగను
గడువ పదునాలుగేండ్లొక్క క్షణముగూడ
నిలువ నిలనని నీమది నిలుపుమన్న!

గడువు గడవకముందె నా కడకు జేరి
దర్శనమ్మిడవలెను సోదర! క్షణమ్ము
నందు నగమాలసించిన ననుజునకును
మేలు సున్నయె! శ్రీరామ! యేలయింక

అనుచు ప్రార్థించి భరతు డత్యాదరమున
అన్నకడ సెలవు గైకొని అరుగుదెంచి
నంది గ్రామమ్మునకు జేరె మందగతుల
మానసము రాము పాదపద్మాల నిలిపి!



ముదమున - 'అయోధ్య కాండ' ను
సదమల మతి పల్కినాడ, సత్యము ప్రజ్ఞా
హృదయులు పాఠకులెల్లరు
సదయులు మీ కృపయె నాకు శక్తి నొసంగున్

కింకరుడను శారదకున్
పంకేరుహ నయను రామపాద ద్వయికిన్
వేంకట శేషాచార్యుడ
సంకల్పము కలిగె రామచరితము వ్రాయన్

సూత్రము వైఖానసమై
గోత్రమ్మాత్రేయ మగుచు గూడగ; నిత్య
స్తోత్ర మొనర్చుచు రాముని
పాత్రుడనైనాడ మహిత పండిత కృపకున్



# అరణ్య కాండ

చిత్ర కూటంబు నందుండి సీతతోడ
దండకాటవి కరిగెను దాశరథియు
సీతతో లక్ష్మణునితోడ శీఘ్రముగను
తన భుజమ్మున భయద కోదండమలర

సాధురక్షణ సేయగ సమయమయ్యె
విపిన సీమల వసియించు విమలతేజు
లయిన ఋషులను కనుగొని ఆదరమున
మ్రొక్కుచును ముందునకుసాగె ముదముమీర

ముందు రాముండు నడచెను ముచ్చటగను
విజయలక్ష్మిగ సీతయు వెనుక సాగ
ధనువు పట్టియు సౌమిత్రి తరలిరాగ
సాగిపోయిరి ముప్వురు సత్వరముగ

సింహ శార్దూలముల్ బహు చిత్రములగు
సూకరంబులు భల్లూక శునక జాతు
లచట దిరుగాడినను వెనుకాడబోక
దట్టమగు కాననంబును చుట్టిరపుడు

శుకపికంబులు శారికల్ బకములెన్నొ!
కూజితంబుల నొసరింప కొమరు మిగుల
తరుతాలతా గుల్మ సంతతుల్ దట్టముగను
నిండె నవ్వన సీమల, నెగడె శోభ!

సర్వసంగ పరిత్యాగ సంయమీంద్రు
లెందరో వసింతురచ్చట నెల్లవేళ
ముదము గూర్చెడు కాసారముల సమీప
మందు తపమొనరింప నానందముగను

ఆశ్రమమ్ముల కొన్నింటి నరిగి చూచి
సాగె ముందుకు శ్రీరామ చంద్రుడపుడు
మందగతులను సీత లక్ష్మణుడు వెంట
నడచుచుండిరి వినయ ధనమ్ము వోలె

క్రూర రాక్షసకోటిని కూల్చివేయ
నవతరించిన శ్రీవిష్ణు వంశలనగ
రామ సౌమిత్రు లిరువురరణ్యమందు
సంచరించిరి వీరులై సంబరమున

మల్లెమొల్లయు జాజియు మాలతులును
పొన్న సంపెంగ పున్నాగ పుష్పవృక్ష
తతుల పరిమళములజిమ్మ దారివెంట
మనసు పొంగగ ధీరులై మానులగని

దుష్టశిక్షణ జేయుచు శిష్టజనుల
కాచి రక్షించుకొరకయి వేచియుంటి
మీదు దర్శన భాగ్యంబు మేలుగూర్చె
ననుచు ప్రార్థించె ఋషుల నయ్యవసరమున

వృక్ష సంతతులన్నియు వృద్ధినంది
పండి తలవ్రాల్చి యున్నవి పండ్లతోడ
కనుల కానందమునుగూర్చె ఘనతరముగ
సంతసము గూర్చెనప్పు డత్యంతముగను

నారవసనాలు ధరియించి నయముగదుర
ఫలములే తినుచుండియు భద్రదీక్ష
గని తపముజేయు తాపసులను సభక్తి
కముగ కనుగొని పూజింప గడిగిరపుడు

భయము గొలిపెడి దండకావనమునందు
చూచిరి విచిత్ర చిత్రముల్ చోద్యముగను
వారు సాహసరూపులై ధీరులగుచు
కోమలాకృతు లయ్యునుగూడ నచట

## విరాధుని వధ

అరుగుచుండిన వారలద్దరిని గనిరి
మాంస భక్షకుడైన దుర్మార్గునొకని
వికృతరూపు కబంధుని వింతగొలుపు
తనువుగలవాని - క్రూరుని దనుజునొకని

మానమునవాడు సీతపై మమతజూపి
భార్యగాగొని యీమెతో బడయవలయు
సుఖములనుచును సీతను చోద్యముగను
బుజముపై నిడె - వణకెను భూమిజయును

నేనెవండనొ తెలియంగ నేరరయ్య
మీరలు - విరాధుడనువాడ మేదినిపయి
నన్ను గెలువంగ వీరుడీనాటి వరకు
లేడు - రేపటికైన రాబోడు - వినుడు

అనుచు సీతను భుజముపైనన్లె యుంచి
సాగిపోవగడంగె రాక్షసుడు వారి
గనుచు - వికటాట్టహాసుడుగ్రత వహించి
అన్నదమ్ములు నిర్విణ్ణులగుచు చూడ

అన్న! మీరేల యీ పనికాజ్ఞ యిడిన
నేనొనర్చెనె చిటికెలో నిలువుడనుచు
తమ్ముడనుచుండ రామబాణమ్ము దుష్టు
డగు విరాధుని గుండెల నదరగొట్టె

వాడొకించుక నిలిచి - ఎవ్వారు మీర
లేల యిచటికి వచ్చితిరిట్లు నన్ను
సాహసమ్మున నెదురింప జనదు మీకు
తొలగిపొండని పలికె దుందుడుకు తోడ

దశరథుని బిడ్డలము మేము - తండ్రి ఆజ్ఞ
వలన వనముల నివశింప వచ్చినాము
లక్ష్మణుడితండు నా పేరు రాముడీమె
సీత నాభార్య - నీ కథ చెప్పుమనగ

జయుని కొమరుండ బ్రహ్మచే శక్తివంత
మగు వరమ్మును గంటి - నీ మాటయేమి?
నే విరాధుడ! వీరులే నిల్వలేరు
నా యెదుట - మరలిపొండు విధేయులగుచు

రాముడతని లెక్కసేయక రౌద్రమూన
వాడు సీతను భువినిడి - బాహుమధ్య
భాగమున రామలక్ష్మణుల్ బాధజెంద
పట్టి బిగియించె గట్టిగ భయము గదుర

వానికాయమ్ము పెరిగె - గర్వమ్ము జూపి
మిమ్ము మ్రింగెదననుచు క్షమింపననుచు
కేకలన్ బెట్టె - జానకి - శోకవహ్ని
మ్రగ్గుచుండెను రామలక్ష్మణుల గాంచి

అన్నదమ్ములు వాని అహమ్ము గాంచి
హస్తములు నరికిరంత భయంకరముగ
వాని తనువును పూడ్చిరి వసుధయందు
పీడ వదలినదని మునుల్ ప్రీతి గనిరి

అచటినుండియు శరభంగు నాశ్రమమ్ము
దాపునకు జేరిరప్పుడే తరలిపోయె
ఇంద్రుడటనుండి - వచ్చె మునీంద్రుడపుడు
రామునెదుటకు వారిపై ప్రేమజూప

రామభద్రుడు శరభంగు రమ్యచరణ
ములకు మ్రొక్కెను-సతియు తమ్ముడునుగూడ
దీవెనలు గొన - మౌనీంద్ర! తావకీన
సేవ మా భాగ్యమని రామదేవుడనియె

బ్రహ్మ వచియించె రామ! ఎప్పటికినైన
నీదు దర్శనమగునని - నిలిచినాడ
నేటి వరకిట - నా పుణ్యపేటి నీ కౌ
సంగ ధన్యుడనని శరభంగుడనియె

మీరలిడు పుణ్య దానంబు మేలుగాదు
నరపతిని గాన అర్హత నాకులేదు
నేనె ఆర్జింతు పుణ్యంబు నియమముగను
మీ కరుణ నాకు చేకూర్చు మిగుల సుఖము

అగ్నితేజుండు శరభంగుడంత రాము
గని పలికెనిట్లు మోదమ్ము గలుగునట్లు
వెడలి కనుగొమ్ము నీవింక విమలయశుడ
మధుర మందాకినీ తీర మహిత సీమ

అచట సుతీక్ష్ణమౌని మీ ఆగమమున
కెదురు జూచుచునుండె నాకిదియు నిష్ట
మనుచు వచియించి కాయమ్ము నవని వదలి
అగ్ని సముడౌచు మెరసె నయ్యవసరమున

రామచంద్రుని జూడంగ ప్రేమమీర
వనమునందున్న యోగులు పరమహాని
వరులు వచ్చిరి - భక్తి భావమ్ముతోడ
వినయ ధనమెల్ల మూర్తిభవించినట్లు

వాలఖిల్య వైఖానస ప్రముఖ భక్త
కోటియున్ వాయుపర్ణ భక్షులు ముదమ్ము
గదుర శ్రీరాము దరికి నుత్కంఠ తోడ
వచ్చి నిలిచిరి కైమోడ్చి వరుస దీర్చి

రాక్షసుల హింస సహియింపరాదు మాకు
రామచంద్ర! నీవే యిక రక్షణమ్ము
జేయవలె నమ్మటంచు - వచింప - వారి
కభయ మొసగెను రాము డత్యాదరమున

సంయమీంద్రులు మీరలు క్షత్రియులకు
నాజ్ఞ నిడవలెగాని అభ్యర్థనమ్ము
తగునె? దుష్టుల శిక్షించి ధర్మమునకు
రక్షణ మొసర్ప నాకు కర్తవ్యమగును

భయపడకుడంచు రాముడు పలికి ముందు
కరిగ ప్రకృతి విశేషమ్ము లరసికొనుచు
ముని సుతీక్ష్ణుని కనుగొన ముదముతోడ
ఆ మహారణ్య సీమలయందు నడచి

తపసి సుతీక్ష్ణుడరసెను దాశరథిని
ప్రేమతో వింటి నీ కీర్తి రామచంద్ర!
వచ్చితివి నేటికాశ్రమ ప్రాంతమెల్ల
ధన్యమాయె! నిజమ్ము నే ధన్యతముడ!

అతిథి సత్కారములు సల్పి — ఆదరించి
ముని వహించెను సంతోషమును - మనోజ్ఞ
భావమని రామచంద్రుని సేవసల్పు
భాగ్యమబ్బిన కతన సంబరము గనుచు

చూడుడీ ఆశ్రమమ్ముల శోభ; రామ!
తొలగజేయుడు మునుల బాధలనటంచు
పలికె - పయనమ్ము జేసె వారల సుతీక్ష్ణు
డాదరమున కృతజ్ఞత అతిశయింప

మరల మరియొక మారిట కరుగుదెంచి
దర్శనమ్మిడుడంచు ప్రార్థన మొనర్చి
రామునిన్ కౌగలించె సప్రేమభావ
సహితుడయిన సుతీక్ష్ణుడుత్సాహి యగుచు

అన్నదమ్ములు సీతమ్మ అచటినుండి
కదలినారలు క్షాత్రమ్ము కదలినట్లు
ధర్మ సంరక్షణమునకై తరలు దక్షు
లైన వారల కడ్డులేదవని యందు

చంపుటకు బూనవేల రాక్షసుల - వారు
మనకొనర్చిన యెగ్గేమి? మాటవరుస
కంటినేగాని నిజముగా నర్హతయును
చెప్పుటకు నాకు లేదని సీత పలికె

జానకీ! మంచిమాటయే కాని! సాధు
పీడన మొనర్చువారల పీచమడచి
ధర్మరక్షణ జేయుట తగును మనకు
వలదు మనకిట్టి శుష్క వివాదమనుచు.

నచ్చజెప్పెను రాముడు - న్యాయమనుచు
లక్ష్మణుండనె! మనకిది రాజధర్మ
మనిరి యిరువురు సాగిరి వనము లందు
శరములు ధరించి సముచితోత్సాహు లగుచు

అంధుడైన కబంధు వారపుడు గనిరి
తాళవృక్షాల వంటి హస్తద్వయమ్ము
చాచి పాంథుల మెక్కు రాక్షసుడతండు
వాని కౌగిట ముప్పారబ్రిముగ బడిరి

వాని భుజమున కెక్కి ఖడ్గాన, భుజము
నరికిరప్పుడు వాడును ధరణిగూలె
వారు ముందుకు సాగిరి వజ్రతుల్య
దీక్షతో సర్వవిధముల తృప్తులగుచు

ముందు రాముండు వెనువెంట ముదిత సీత
వెనుక లక్ష్మణుడప్పుడు వెడలినారు
ధర్మదేవత నడచెడి తరుణమద్ది
కనులపండువ గలిగించు ఘట్టమద్ది

ధర్మభృత్తు చెప్పినకథ తనివిగూర్ప
మధురగాన ప్రభావ సంపదల తోడ
మెరయుకాసార వైభవ స్ఫురణగాంచి
మురియుచున్ సాగినారలు ముందునకును

మునివరేణ్యుల చరణాలు ముదముమీఱ
పూజ సల్పుచు రాముండు పోవదొడగె
కాననమ్ముల వెంట సౌఖ్యమ్ము మరచి
ధర్మదీక్షను గాని నవోత్సాహ మలర

అచట నుండియు దక్షిణం బరుగు వేళ
నరసిరప్పుడు వార గస్త్యాశ్రమమ్ము
దరికరిగి మౌనిగాంచి వందన మొనర్చి
ముదము నందిరి దీవింప మునివరుండు

మనకు చెప్పె సుతీక్ష్ణ మౌని వర్యు
డాయన వచించు గుట్టలియ్యవియె చూడు
లక్ష్మణా! అనె రాముడు లతలుపూలు
కనులకింపును సొంపును కలుగజేయు

తండ్రి ఆజ్ఞ శిరమ్మునదాల్చి దండ
కాటవికి జేరినాము - జయమ్ము నంది
యాత్ర సాగించు బలము మా ఆత్మకొసగి
ధన్యులను జేయుడని పల్కె దాశరథియు

క్రూరులైనట్టి రాక్షసకోటి గూల్చి
భువనరక్షణ సేయంగ బూనినావు
కమలలోచన మా శుభాకాంక్షలివియె
శుభము మీకగునని అగస్త్యుండు పలికె

రావణుని గూల్పగల అస్త్ర రాజములను
మౌని రామునకిడియె సమ్మతి వహించి
రాఘవుడు చేకొనియె - అనురక్తితోడ
ముని శుభాశీస్సులంది సమ్ముదము జెంది

రామచంద్రుడు కొన్నాళ్లు రమణితోడ
నాశ్రమంబున నిల్చియు నాజ్ఞగొనియు
పయనమాయె నగస్త్యుని పాదకమల
ములకు మ్రొక్కి ముదమ్మున ముందుకరుగ

చెంగటనె యున్నదయ్యా! ప్రసిద్ధిగన్న
పంచవటి - మీరలచట వసించవచ్చు
పోయి రండంచగస్త్యుండు పుష్కలాను
రాగమున పల్కినాడు శ్రీరాము గాంచి

తాము పట్టిన వ్రతదీక్ష ధన్యతగన
సంతసమున పయనమ్ము సాగెనపుడు
పంచవటికిని జేరి భద్రముగను
సీతయును రామ లక్ష్మణుల్ శీఘ్రముగను

దివ్యమైనట్టి ఫలవృక్ష తీర్థ వసతి
గాంచి వారలు మోద సమంచితులయి
పత్రతతిచేత పాకను పదిలపరిచె
వాస్తుకనుగుణమగుచును వరలునట్లు

నారచీరలు ధరియించి నాతితోడ
తేజమొప్పార శ్రీరామ దివ్యమూర్తి
వాస మొనరించెనట కొన్ని సత్సరములు
శిష్ట రక్షణమున ప్రశస్తిని గడించి

చిత్రమైనట్టి ఆవన సీమయందు
పక్షిరావంబు లెన్నియో బాగ వినుచు
మానసంబున సంతోషమూని మిగుల
ప్రేమ మీరంగ దంపతుల్ ప్రీతినొందె

దుష్టశిక్షణ సేయంగ దోర్బలుండు
సర్వకాంతార సీమల సంచరించె
ధర్మభావన గలిగి మోదమ్ము తోడ
వజ్ర సంకల్పుడై రామభద్రుడపుడు

ఒక దినమ్మున గోదావరిని జేరి
స్నాన మొనరించి వెనుకకు జనెడివేళ
రాముునకు నయనయుగాభి రామునకును
శూర్పణఖ నిల్చె నెదురుగ చోద్యముగను

సుందరా! రాకుమారుడా! సూర్య తేజ!
ఏల వనముల దిరిగెద వెవరు నీవు?
నిరుపమానమ్ము సొగసు - వన్నెల వరాల
దివ్య రూపమ్ము గలవాడ! భవ్యమూర్తి!

అనుచు రఘురాము గనుగొని - అనియె నంత
శూర్పణఖ దాశరథి రూపశోభ పొగడి
వినియు విననట్లు - రాముడు విస్తుపోయి
పలుకు పలుకక మానె నప్పడతి గాంచి

నీకు తగదయ్య! యీనాతి నిశ్చయముగ
తగుదు నేను నిజమ్మిది — దాచనేల
కీర్తిగల వంశమునబుట్టి కేలుమోడ్చి
ప్రార్థన మొనర్చ నన్నేడబాయకయ్య!

సర్వ విధముల సేవించి సంతసింప
గలుగునట్లు చరించి నీకాంత నగుచు
వెంట నుండెద నామాట వినగదయ్య
భార్యగా నన్ను స్వీకరింపన్ గదయ్య!

అనిన రక్కసి పలుకుల కబ్బురమ్ము
గనుచు శ్రీరామచంద్రుడు డిట్లనియె నపుడు
క్రోధ మెరుగని లీల - విరోధ భావ
మించుకయులేని పగిది - భావించి మించి

నన్ను కోరుట నీకెట్లు న్యాయమగును
సుదతి నేను గృహస్థును - వదలుమిట్టి
దుష్టమైన దురాశను - తొలగిపొమ్ము
కోరవలదిట్టి నీచపు కోరికలను

స్వర్ణ తేజమ్ము గలవాడు - స్వచ్ఛ హృదయు
డయిన తమ్ముడు లక్ష్మణుండతని కడకు
పొమ్ము నీకల పండించుకొమ్ము లెమ్ము
మరల నాకడ నటువంటి మాట వలదు

హావభావాల లక్ష్మణు సరసి మురిసి
తన మనోభావ మెరిగింపదలచి వలచి
కదలె శూర్పణఖయు - వేగ వదలి రాము
గమన వేగమ్మునన్ ప్రేమగలిగి మెలగి

శూర్పణఖ యేగి లక్ష్మణుజూచి పలికె
నిన్ను నమ్మితి వచ్చితి నన్ను మోహ
వార్థిముంచక ప్రేమ భావమ్ము జూపి
పెండ్లియాడు మటంచును ప్రియము గదుర

కన్నుగీటెను మోహమ్ము గ్రమ్మ నేమొ!
వలపు పలుకుల కులుకుల తళుకు గురియ
సరస జేర ప్రయత్నించె - సంబరమున
కౌగలింపగ ప్రేమ నుత్కంఠ జూపె

మనమునందున గినిసి లక్ష్మణుడు కన్ను
లెఱ్ఱజేయుచు కాముకి నింక దరికి
జేరనీయగ రాదని ఘోరమైన
ఖడ్గమున గోసె నాసికన్ కర్ణములను

మండిపడి శూర్పణఖ బాధనుండి తట్టు
కొనగ వీల్గాక వగచుచు - క్రూరచిత్త!
నన్ను బాధించినట్టి మీ అన్నదమ్ము
లెట్లు సుఖముల నందెదరింక ననుచు

పలికె లక్ష్మణు బెదరించి పరుగుబెట్టి
ఖరుని దూషణు జేరి యీ కథను జెప్పి
రామ లక్ష్మణులన్ జంపి రండటంచు
ప్రోత్సహించెను దుష్టదుర్బుద్ధి తోడ

ముక్కు చెవులను కోయగ మూల్గుచున్న
సోదరిని గాంచి వారు విషాదమంది
ఆమె కపకార మొనరించినట్టి వారి
నంతమొందింప నెంచి ప్రయాణమయి

మీరలే దిక్కు నాకని - మీరు పంత
మూని యుద్ధమొనర్పక నూరకున్న
నాకు రక్షకులెవరని శోక జలధి
నూగు శూర్పణఖను గని ఊరడించి

వారలిరువురు జని పాదచారులగుచు
వనముల జరించు రామలక్ష్మణుల గాంచి
అనుగు సోదరి నాపదయందు ముంచి
నట్టి దుర్మార్గులార! మీ కపజయమ్ము

కాచుకొనుడింక - మీ శక్తి కాలరాచి
కచ్చదీర్చుట మాపని కదనమందు
మమ్ము గెలుచుట మీ కసామాన్యమనుచు
సింహనాద విశేషమ్ము జేసిరపుడు

దండకారణ్యమునగల తాపసులను
కష్టములపాలు జేసెడి కఠినులార!
సమర మొనరించి మిమ్ముల జక్క నడచి
మునుల రక్షింప బూనితిమనుచు పలికి

సీతకున్ రక్షకునిగాగ భ్రాతనుంచి
రామదేవుడు వారి గర్వమ్ము నణచ
పూనుకొనె - లక్ష్మణుడు శ్రద్ధబూని ఆమె
కంటగా నిల్చి సేవింపనుండె నచట

వేలకొలదిగ రాక్షసుల్ వెంటరాగ
ఖరుడు పోరాడి రాముని ఖడ్గధార
కాహుతిగ మారె దూషణుడట్లె కూలె
శూర్పణఖ క్రుంగి - రావణు జూడబోయె

అన్న నా మనవిని వినుమన్న అనుచు
జరిగిపోయిన కథయెల్ల సవిరముగ
రావణుని గాంచి వినిపించి కావుమన్న!
వారి వధియించినన్నని పలికె చెల్లి

వారిలో పెద్దవానికి భార్య - భువన
మోహిని - సువర్ణ - అందాల ముద్దుగుమ్మ
కలదు - నీవామె పతివికాగలుగు నెడల
నాకు సంబరమని శూర్పణఖ వచించె

సోదరుల శౌర్యపటిమయు చోద్యమైన
దయ్యు నీకడ వారల ఆటకట్టు
ననుచు ప్రోత్సాహ మొసగి ధైర్యమ్ము గూర్చి
అన్నను రణమ్ము నకు పంపెనపుడు చెల్లి

దిక్పతుల పూజలందెడి ధీరవరుడ!
నీకు తిరుగున్నదా! అనసీ తలాన
నారచీరలు గట్టెడి వారు నిన్ను
కోరి యెదిరించి గెల్చుటగూడ గలదె?

అనుచు పలువిధముల రావణాగ్రహమ్ము
రెచ్చగొట్టె - వారలమీద కచ్చ బెంచి -
చిచ్చు రగిలించె - చెల్లెలు ముచ్చు పగిది
కాంత పగబూన జరుగు నీగతి నిజమ్ము

శూర్పణఖ! చెల్లెలా! ఘనశోక తప్త
హృదయ నీకిక లభియించు ముదము నిజము
రావణుని దీక్షనెరిగి ఉల్లాస పూర్ణ
చిత్తమున నుండుమని అన్న చెప్పినపుడు

వెంటనేవచ్చి మాట్లాడి వెడలుమనుచు
కబురు పంపించె మారీచుకడకు - రాక్ష
సాధిపతియగు రావణుండతని ఆజ్ఞ
శిరమునన్దాల్చి వాడు వచ్చెను రయమున

నీవు నాకు సఖుండవు - నిరుపమాన
బుద్ధి బలమున్నవాడవు - పొగడుటిద్ది
కాదు; మారీచ! నామాట కాదనకుము
చేయు మీపని యనుచు శాసించి చెప్పె

రావణుడు చెప్పుచుండె సర్వమ్ము మరచి
శ్రద్ధగా వినుచుండె, నా సఖుడు - వారి
మాటలను విని ఉప్పొంగె మనసునందు
శూర్పణఖ - పగదీరు నంచును దలంచి

రామ లక్ష్మణులను వారరణ్యమందు
జేరి నా సోదరికి కోరి చేసినారు
తీరని పరాభవమ్మది ఆరిపోని
అగ్నివలె మండు నా హృదయమ్మునందు

మాయలేడిగ సీతను మాయబుచ్చి
రాముని సుదూరసీమ జేరంగజేసి
వారికెని వియోగలీల జేకూరునట్లు
నీవు నాకిట సాయమై నిలువవలెను

రావణుని పల్కులను విని - రామబాణ
శక్తి నెరిగిన యట్టి రాక్షసుడుగాన
పలికె మారీచుడిట్లు సంభ్రమము గదుర
ప్రభువుతో భయ వినయ సంభాషణముల

భువిని కాపాడ బుట్టిన భువనపతితో
వైరమూనిన మోసంబు వచ్చునయ్య
రామచంద్ర సమానుడో రాజు లేడు
పౌరుషము కల్గినట్టి దైవమ్ము నిజము

నీతిగా నీవు జీవితరీతి నెల్ల
గడిపి - ఆర్జించుకొనుము విఖ్యాతి నింక
నా వలనగాని పనియిది - నన్ను కరుణ
తోడ కనుగొను మీ దృష్టి తొలగమేలు

దశభుజుండనె మారీచు తత్త్వమెరిగి
అరుణ నేత్రాలతోడ భయమ్ము గొల్ప
ఖడ్గమున్ గొని నీచుడా! గళము ద్రుంచి
వైచెదన్ పిరికితనమును వదలుకొనుము

క్రూరు డితని చేతిలో కూలుకంటె
రామ బాణాగ్ని కసువులర్పణ మొనర్చు
టుచితమని యెంచి పోవుట కొప్పుకొనియె
రావణుడు మెచ్చి బయలుదేరగ నొనర్చె

కదలిపోయెను రాజాజ్ఞ వదలకతడు
పంచవటికి వారల మోసగించుకొరకు
చిత్ర వర్ణంబుగలిగి విచిత్రగతుల
చెంగలించెడి స్వర్ణ కురంగమగుచు

గుండె తడిలేని రావణు గుణము తెలిసి
యున్న వాడౌటచే మదినున్న మాట
వెలికిరానీక రామునివలన జన్మ
ధన్యమగునని తలచుచు తలనువంచె

ఆశ్రమ ప్రాంగణాన మోహమ్ము గూర్చు
పసిడి లేడినిగని సీత భ్రాంతి జెంది
ప్రాణనాథుని గని తాను ప్రార్థనమ్ము
నర్చె లేడిని కొనిరమ్మటంచు పల్కె

భామ వాక్యంబు వినియెను రామమూర్తి
ఆశ్రమంబును కాపాడుమయ్య అనుచు
తమ్మునిన్ జూచి పలికె ముదమ్ము గూర్ప
భార్య కోరిక నెరవేర్ప బయలుదేరె

అంబులనుబూని రాముడయ్యవసరమున
రంగు రంగుల బంగారు రంగుజింక
పట్టి తెచ్చెద నిచ్చెద పడతి సీత
సంబరము గూర్చ కొరకంచు సాగెనపుడు

చిక్కనటులను, చిక్కక చిత్రగతుల
పారుచుండెడి లేడిని పట్టువరకు
విడువబోవక శ్రీరామ విభుడు చనియె
దూరదూరాన నున్నట్టి తీరములకు

ప్రాణములతోడ లేడిని పట్టితెచ్చి
సీత కొసగుటకై కృషి జేయుచున్న
రాము బాణమ్ముపోయి ఉరమ్ముదాక -
తోచినట్లుగ నపుడు మారీచు డరిచె

రామచంద్రుని గళనాదమేమొ అనెడి
భ్రమను కలుగగ జేయుచు - పరుగులెత్తు
చున్న మారీచుడరిచె నా పన్నవోలె
నపుడు హా లక్ష్మణా! సీత! హా యటంచు

వినియె సీతమ్మ - ఆ కేక - విస్తుపోయి
అన్న! ఆపద నున్నవాడయ్యె! తక్షు
ణమ్మె వెడలుమటంచు దీనముగ పలికె
వేదనన్ జెంది - పరిపరి విధములుగను

తల్లి వైనట్టి నీ ఆజ్ఞ తలను దాల్చి
వలయునను మాట నిజమె - వివాదమేల
అన్ననలయించు వారలియ్యవని లేరు
సత్యమిది నమ్ముమనుచు లక్ష్మణుడు పలికె

క్షాత్ర విభవమ్ము విరియించి శాత్రవులను
సమయ జేసెడి నిస్తుల శక్తియుతుడు
వీరుడైనట్టి మా అన్న - ధీరుడమ్మ!
నిన్ను విడిపోవజాలనే నన్నకొరకు

సీత లక్ష్మణు మాటలు చెవినిబెట్ట
కాగ్రహమ్మున పలికె నిరాదరముగ
"అన్న ఆపదబడియున్న యట్టివేళ
సందియము గల్గజేయు నీ చర్య నాకు"

సీత పలుకులు వినినంత చిత్తమందు
తత్తరమ్మున నొసగె ప్రత్యుత్తరమ్ము
లక్ష్మణుడు - పోయివచ్చెద రాముకడకు
గీతగీచెద రాబోకు మాత! దాటి

ఇక నిచట నుండుటయె నాకు హితముగాదు
పోవలెను రాముకడకని పొరలుచున్న
దుఃఖమును మ్రింగుకొనుచు ముందునకు సాగె
లక్ష్మణుడు - దేవతలను ప్రార్థన మొనర్చి

అమ్మ! అన్నయ్యకొరకు నేనరుగుచుంటి
దేవతలు నీకు మేల్గూర్చి కావగలరు
శుభము లిడగలరనుచు సంస్తుతి నొనర్చి
తరలె సౌమిత్రి మదిని ఖేదమ్ము తోడ

అచట మాయావియై దొంగయగుచు నరచి
వంచన మొనర్చు మారీచు వైఖరులకు
కినిసి శ్రీరాముడొక బాణమున వధించె
వాని - జిత్తులమారియై వరలు వాని

తమ్ముడొక్కడె యుండె సీతమ్మ చెంత
వేగవెడలుట మంచిది - ఆగ తగదు
లక్ష్మణుని జేరనిటుల నుల్లాసపడుచు
బయలుదేరెను శ్రీరామ భద్రుడంత

కలతజెందిన మనసుతో కదలె విభుడు
పర్ణశాలకు - రాక్షస ప్రబలశక్తి
కపటసన్యాసి రూపాన - కాంత చెంత
జరుపుచున్న మోసమ్ము తానెరుగలేక

లక్ష్మణుడు వెడలినంత నుగ్రస్వరూపు
డయిన రావణ దనుజుండు యతిగమారి
దండము కమండలమ్మును దాల్చి పర్ణ
శాలదరి భిక్ష యాచించె సంయమివలె

అతిథి అరుదెంచెనని సీత ఆదరమున
దూరమునసుండి భిక్షను కోరి యిడగ
ముంగిటికివచ్చి సన్యాసి మురిసికొనుచు
దగ్గరకువచ్చి యిడుమని తాను పలికె

వినయవతియైన జానకి తనకు మరది
చెప్పిన విధమ్ము మరచియు చేరి దరికి
భిక్ష నిడబూనె నింతలో భీతిగూర్చు
పదితలల రావణుండు కన్పడియె ముందు

కపట సన్యాసి రాక్షస గణమువాడు
మోసమిది యంచు - సీతయు చేసినట్టి
పనికి చింతించు నంతలో భయము గొల్పు
పగిది నవ్వుచు రావణ ప్రభువు పలికె

లంక నేలెడువాడ! నిశ్శంకముగను
త్రిభువనమ్ముల నేలుచు; త్రిదశవరుల
చేత సేవల గొనువాడ - సీత నిన్ను
వలచి వచ్చినవాడ! రావణుడ నేను

నిన్ను గొనిపోవ వచ్చితి నన్ను గూడి
లంకకే రాణివగుము - విలాస జీవి
తమ్ము నాతోడ గడుపుము - తగునటంచు
పలికె రావణుడామె దిగ్భ్రాంతి జెంద

నీచుడా! యతిరూపాన నీవు వచ్చి
వంచన మొనర్చినావు - నా భర్త లోక
పూజ్యుడగు రామచంద్రుడు - పుణ్యశీల
నయిన ననుగొనిపోవ నీకగును ముప్పు

మరలిపోవుట మంచిది - మరలకున్న
సర్వనాశన మగుదువు - సత్యమిద్ది
అనుచు కనులెఱ్ఱజేసి సీతమ్మ పలికె
పగలబడి నవ్వెనపుడు రావణుడు మిగుల

మనుజమాత్రుడు రాముడు మా పురమ్ము
వచ్చుటా! నను గెల్చుటా! వజ్ర పంజ
రమ్ము ఛేదించుకొనగ మార్గమ్ము లేదు
రావణుని గెల్చు వారలు రారు - లేరు

రాణివై లంకనేలుచు రావణునికి
పట్టమహిషివిగా గౌరవమ్ము నంద
రమ్ము - మార్గాంతరమ్ము శూన్యమ్మటంచు
పలికె రావణుడా అమ్మ భయము నంద

మరది మాటలు వినక అమానుషముగ
నిందజేసిన ఫలమిది నిశ్చయముగ
నని తలంచుచు సీత రామా! యటంచు
ధ్యాన మొనరింపబూనె నేత్రములు మూసి

AQ

సర్వ దేవతలార! ప్రసన్న హృదయు
లయిన మునులార! ఘనులార! అఖిల వృక్ష
సముదయములార! పశుపక్షి జాతులార!
దీనురాలను నను గావ బూనుకొనుడు

రావణాధముడను నొక రాక్షసుండు
నన్ను బంధించు కొనిపోవ నున్నవాడు
మీరె రక్షింపవలయు నా మేలుకోరు
నాధుడే చెంతలేని క్షణమ్ము నందు

ఈ విపత్తును పతికెరిగించి కష్ట
కాలమున మీరలే జాలి చూపకున్న
నన్ను రక్షించు వారలున్నారె! మీకు
మొక్కు కొనెదను - మీరలే దిక్కు నాకు

సీత యీరీతి విలపించి చేతులెత్తి
ప్రాణులు లర్పించుచుండ పాప ప్రసక్తి
చిత్తమున లేశమేనియు చేరనీక
రావణుడు జేర్చె సీతను రథము మీద

భూనభమ్ములు మార్మ్రోగ బోరుమనుచు
కనుల నీరిడు సీత దుఃఖమ్ము గాంచి
జాలిజూపని రాక్షస చక్రవర్తి
గగనసీమల రథము వేగముగ నడపె

గుండె లవియగ నేడ్చుచు కుములుచున్న
జానకిన్ గని - కన్నీరు జార్చి క్రోధ
మగ్నుడగుచు జటాయువు మానసీయ
పక్షికులవరుడడ్డుగ వచ్చి నిలిచె

రథముపైగల టెక్కెము రాలిపడగ
తన్నె! రావణుడది చూచి తామసమ్ము
పెల్లుబుక వానిగని నిలువెల్ల నూగి
పోవుచున్ పల్కె నుగ్రుడై పోయి యిట్లు

నీవు పక్షివి నీశక్తి నీకు తెలియ
కిట్లు పలుకగనేల? క్షమించ నిన్ను
నా బలము చూడుమనుచు బాణమ్ము వదలి
ఖడ్గమెత్తె జటాయు పక్షముల మీద

శర పరంపర గుప్పుచు చండభండ
నమ్ము సాగించె రాక్షస నాథుడపుడు
శక్తి కొలదిగ పోరాడసాగె పక్షి
రాజు, రావణుతోడ నిర్భయము గదుర

రావణుని ఖడ్గహతికి క్రూరముగ నొరిగె
పక్షములు రాలి భువిబడ పక్షిరాజు
ప్రాణములు కడగంట నిల్వంగ రామ!
రామ! అనుచును కూలెను భూమిమీద

పయనమైపోయె పౌలస్త్య పౌత్రుడపుడు
సింహనాదమ్ము సల్పుచు సీతనుగొని
లంకకంతట - వాని పరాక్రమమ్ము
గాంచి భీతిల్లి - అమరులుత్కంఠ జెంద

అడవిలో రామునిన్ గని "అన్న జరిగె
నిట్లనుచు జెప్పె" జరిగినదెల్ల తమ్ము
డరరె! జానకి నొంటిగ నచట వదలి
ఏల వచ్చితివనుచు కోపించి - అన్న

పరుగు పరుగున సీతకై పర్ణశాల
పజ్జకరుదెంచి, శూన్యమౌ పాక గాంచి
లక్ష్మణా! మోసపోతిమి రాక్షసాళి
మాయలోబడి అనుచును మదిని కుమిలి

బోరుబోరున విలపించె పుణ్యపురుషు
డైన శ్రీరామచంద్రుడు దయ్యవసరమున
చేయునదిలేక తమ్ముడు చింతతోడ
కనుల నీరిడి నిలచెను కలతజెంది

పామరుని రీతి రాముడు భార్యకొఱకు
పలవరించగ సాగెను, పడతిలేక
ధర్మసాధన మింకెట్లు దరికిజేరు
ననుచు విలపించసాగె నత్యంతముగను

దిక్కుతోచదు లక్ష్మణా! దివ్వెలేని
యిల్లు బ్రతుకాయె నయ్యయో యింకనెట్లు
భూమిజాతను కోల్పోయి భువిని జీవి
తమ్ము గడుపగలాడను! నమ్ము నిజము

అన్న మాటలు విని కొంత మిన్నకుండి
పిదప నెమ్మదిగా నెట్లొ పెదవి విప్పి
అగ్రజా! మీరలే యిట్టులలమటింప
మమ్ము బోంట్లకు వేరేది మార్గమయ్య!

అనుచు నోదార్చ యత్నించి, అడవియందు
తల్లి సీతమ్మ జాడను తథ్యముగను
తెలుసుకొనగల మిప్పుడే దీక్షబూని
రండురండని పల్కెను లక్ష్మణుండు

రాము డామాటలను విని రయము మీర
కాననమ్ముల నర్థాంగి కానుపించు
నన్న భావన సరిక్రొత్త ఆశనింప
కదిలె ముందుకు కన్నీటి కణములొలుక

పుట్టదరికిని, కనిపించు గుట్టదరికి
జేరి రాముడు వ్యాకుల చిత్తుడగుచు
తాల్మి విడనాడి 'సీత - సీతా' యటంచు
వెదకసాగెను ప్రకృతియే విస్తుబోవ

ఎంత వెదకిన నడవిలో సుంతయైన
జాడ కనిపించదాయెను - జానకమ్మ
కేమి వాటిల్లెనో కాని - ఎవరి క్రూర
కర్మమోయని సోదరుల్ కలగు వడిరి

ఇంత లోపల చెవులకు వింతగాను
పక్షిరావము వినిపించె భద్రముగను
'రామ! రామా' యటంచును - రాముడంత
కదిలె ముందుకు వడిగ నుత్కంఠతోడ

పక్షములు రెండు తెగి శక్తి వట్టిబోయి
అసువు లెక్కడో గుటగుట లాడుచున్న
పక్షిరాజును గని రామభద్రుడెంతో
కరుణతో మేను నిమిరెను దరికి జేరి

సోదరుల నిద్దరిని జూచి శోకముడిగి
రామ! నీ దర్శనమునకే ప్రాణములను
నిలుపుకొని ఉంటినయ్య నేనిక్కవముగ
ననుచు ప్రణమిల్లె పక్షీంద్రు డాదరమున

"ఎవరు నీవయ్య! ఎందులకిట్లు రక్త
సిక్తమైనట్టి తనువుతో చివికిపోయి
నాదు నామమ్ము స్మరియించినావు?" చెప్పు
మనగ రాముడు, పక్షిరాజనియె నిట్లు

'రామ! నీ తండ్రి దశరథ రాజునకును
స్నేహితుడ నే జటాయువున్, సీతజాడ
తెలియజేయగ - ప్రాణముల్ నిలిచెనయ్య
ఇంతవరకును' - వినుడు వృత్తాంతమింక

లంక నేలెడు మహారాజు రావణుండు
ధర్మమెరుగని రాక్షసాధముడు, క్రూర
చిత్తుడై, ఎత్తుకొనిపోయె సీత నరెరె
అతని వారింపబోయి యుద్ధ్యైతి నేను

పట్టు విడువక చీకాకు పరచినాడ
నోపినంతగ వానిని - ఓయి రామ!
ముదిమి హెచ్చుటచే నన్ను ముష్కరుండు
పక్షములు కోసి పడవైచె వసుధపైన

ఎంత వేడిన వినక, రవ్వంతయైన
జాలిదలచక దనుజుడా జానకమ్మ
గోడు పెడచెవినిడుచు గగ్గోలు పరచి
ఎత్తుకొని పోయెనయ్య - ఉన్మత్తుడగుచు

మెల్లమెల్లగ వృత్తాంతమెల్ల జెప్పి
కన్నుమూసెను రాముని కరములందె
పక్షి వరుడౌర! తండ్రికి పట్టనట్టి
యోగమబ్బెను! తన పుణ్య భోగమేమొ!

చితుకులను జేర్చి రాముడు చితిని పేర్చి
క్రమముదప్పక దహన సంస్కారములను
పూర్తిజేసెను దీక్షతో ముక్తినొసగి
మంచిపని యెంత పుణ్యమార్జించె నహహా!

కొడుకునై యుండి, తండ్రికి కొరివిబెట్ట
లేకపోయితి ననుచును శోకజలధి
మునిగినాడను - సోదరా జనకునికిని
ఆప్తుడీతని సేవ సంతృప్తి నొసగె!

రాముడీరీతి పలికి శరాసనమ్ము
చేత గైకొని, తలపున సీతమెదల
కనుల కన్నీరు కాల్వలై కదిలిరాగ
అడుగు ముందుకు వైచె నయ్యడవిలోన

నెమ్మొగమ్మున క్షాత్ర తేజమ్ము వెలుగ
వేషమందున మునివృత్తి వింత గొలుప
వదనములు శోకదేవత సదనములుగ
వెడలిరిద్దరు సీతను వెదకుటకును

తరుణి గానక శోకసంతప్త హృదయు
లగుచు వనమున ముందున కరుగువేళ -
"రమ్ము! సుందరా! మదన సామ్రాజ్యమేలు
కొమ్ము! సుఖములనిక జుఱ్ఱుకొను" మటంచు

రాక్షసాకృతిగల ఒక రమణి లక్ష్మ
ణునిజూచి మోహించి వినుతిజేసె -
కోపగించిన సౌమిత్రి కుపితుడగుచు
ముక్కు చెవులను తెగగోసె ముదితకపుడు

ఇంక మరికొంత దవ్వున కేగుసరికి
వికృత రూపమ్ముతో నుండి, భీతిగొలుపు
హస్తములజూచి జీవుల నారగించు
మొండెమొక్కటి కనుపించె గుండెలదర

ఆ కబంధుడు వారల హస్తయుగము
నందు బంధించి వదన గహ్వరము చెంత
నిలిపి, వికటాట్ట హాసమ్ము సలిపి, కినిసి
ఎవరు మీరలటంచు ప్రశ్నించెనపుడు

తమదు వృత్తాంతమంతయు దనుజునకును
విశద మొనరించి ఇనవంశ వీరులతని
హస్తములు రెండు ఖండింప నతడు రోద
నమ్ము సలుపుచు మునుల శాపమ్ము దెలిపె

రాములక్ష్మణు లగ్నిని రగులజేసి
భస్మమొనరింప నతని శాపమ్ము తీరి
దివ్యగంధర్వుడై నిల్చి తేజమొప్ప
సోదరులజూచి యిట్లనె నాదరమున -

పరుల హింసించి వికృత రూపమ్ముతోడ
శాపమొందిన గంధర్వజనుడ నేను
'దనువు' నాపేరు మీకు సందర్భము-నకు
తగిన సాయమ్ము జేయుట ధర్మమనుచు

ఆపదల యందుబడి యుండునట్టివేళ -
ఆప్తమిత్రుని సాయ మత్యవసరమ్ము
ఋష్యమూకాద్రి నున్న సుగ్రీవుడన్న
వానరుడు మీకు తగినట్టివాడు సుమ్ము

అతనితో స్నేహమును జేయుడయ్య మీరు
కార్యసాఫల్య మొనగూడు, కలికి సీత
జాడ తెలియు నటంచును సవివరముగ
తెలిపి, మరియొక్క మారిట్లు పలికెనతడు

మార్గమందున మాతంగ మౌని వరుని
ఆశ్రమమ్మున శబరి మీ ఆగమనము
కొఱకు మేనెల్ల కనులతో కొలుచుచుండె
నామె కోరిక మన్నించు డనఘులార!

చింత తొలగించునట్టి విశేషములను
'దనువు' తెలుపుచు, సెలవు గైకొనిన పిదప
మంచిరోజులు వచ్చును మనకటంచు
సోదరులు నెమ్మనమ్మున సేదదీరి

మార్గమధ్యంబు నందున్న మౌనివరుల
ఆశ్రమమ్ముల జూచుచు నతిథిసేవ
అందుకొనుచును సాగిరి ముందునకును
రామలక్ష్మణు లిర్వురణ్యమందు

మున్ను మాతంగ మౌనిచే ముక్తినొందు
సాధనమ్ముగ శ్రీరామచంద్రు నామ
మహిమనెరిగి తపమ్మున మనను నిలిపె
భక్తి మూర్తీభవించిన పడతి శబరి!

ప్రతి దినమ్మును పూవులు, పండ్లు, నీరు
పదిలముగ తెచ్చి శ్రీరామభద్రు పాద
యుగము పూజింప మదినెంచి పగలు రేయి
ఎదురు జూచుచు నుండెనా ఎఱుకసాని!

ముగ్గుబుట్టగ తలమారె, ముదిమి వలన
తనువు వణక సాగెను, దయను జూడ
రమ్మ వేగమె రామ! రా రమ్మటంచు
శబరి త్రికరణముల వేడె స్వామినపుడు

ముదితజాడను వెదకుచు ముందునకును
సాగు సోదరులిర్వురు శబరి ఆశ్ర
మమ్ము చెంతకు జేరిరి మార్గమందు
మునులొసంగెడు దీవెనలను గ్రహించి

రామచంద్రుని పాదాల రవళి వినిన
శబరి పులకించె భక్తితో జగము మరచి
కనులనానంద బాష్పాలు క్రమ్ముకొనగ
లేచి యెదురేగె స్వామిఁ జూచు కొఱకు

రఘుకులాన్వయుడైన శ్రీరామచంద్రు
పాదయుగమున శిరముంచి పరవశించి
జన్మజన్మల పుణ్యమే సఫలమాయె
ననుచు మేనెల్ల మరచె నయ్యతివ శబరి

లక్ష్మణునిజూచి నవ్వుచు రాముడపుడు
భక్తురాలిని కరములఁబట్టి యెత్తి
సేద తీర్చెను, శబరియు మోదమలర
ప్రభువు నర్చించె వివిధ పుష్పములతోడ

తపము పండెను నేనింక ధన్యనైతి
సరసిజాక్షుని చరణ సంస్పర్శ తోడ
అర్ఘ్యమిచ్చెద గొనుమయ్య ఆర్య వినుత!
పాద్య మిడెదను గైకొమ్ము పరమపురుష!

అనుచు రాముని వేడుచు నమితభక్తి
లక్ష్మణునిగూడ ప్రీతితో లక్ష్యపెట్టి
అతిథి సేవల నందించె మితములేని
ముదము వార్నిధివోలె నుప్పొంగి పోవ

పుల్లనైనట్టి ఫలములనెల్ల, తీసి
తీయతీయని ఫలములందీయ నెంచి
ముందుగనె తాను రుచిజూసి విందుజేసె
స్వామివారికి శ్రద్ధతో! శబరి మాత

ఏమిటిదియని అడుగక స్వామి మిగుల
ప్రేమతో స్వీకరించెను పేదవిందు
తెలుసుకోనలేక మర్మమ్ము తెల్లబోయి
అట్టె నిలబడె లక్ష్మణుం డబ్బురముగ

చిఱుత నగవులు మోమున చిందులాడ
స్వామి తమ్మునిజూచె - నా సమయమందు
'స్వపర భేదమ్ము నెరుగని స్వచ్ఛమైన
ఆత్మభావన యిది' - అనినట్లు తోచె

చూడుమో తమ్ముడా యిందు సుదతిభక్తి
నిర్మలంబైన మదిలోని నెనరు, స్వామి
సేవజేయుటలోనున్న భావ గరిమ
అనుచు రాముడు ఫలముల నారగించె

అయ్య! రామయ్య తండ్రి! నా అఘము బాపి
ముక్తినొసగు మటంచును భక్తితోడ
ప్రార్థనము సల్పి యోగాగ్ని భస్మమయ్యె
శుద్ధమానిసి శబరి విశుద్ధముగను!

ఆశ్రమమ్మునగల స్వచ్ఛమైన తీర్థ
ములను స్నానాదులను జేసి, ముఖ్యమైన
తర్పణము లిచ్చె పితృదేవతలకు శ్రద్ధ
తోడ రాముడు తమ్ముడు కూడిరాగ

ఋష్యమూకమ్ము జేరి, సుగ్రీవుగాంచి
సఖ్యమును పాదుకొల్పంగ, సత్వరమ్మె
కదలిసాగిరి రామలక్ష్మణులు - శోక
తిమిరమందున సంతోష దీప్తివెలయ!



ముదమున - 'అరణ్య కాండను'
సదమలమతి పల్కినాడ సత్యము, ప్రజ్ఞా
హృదయులు పాఠకులెల్లరు
సదయులు మీ కృపయె నాకు శక్తి నొసంగన్!

కింకరుడను శారదకున్,
పంకేరుహనయను రామపాద ద్వయికిన్
వేంకట శేషాచార్యుడ
సంకల్పము కలిగె రామచరితము వ్రాయన్

సూత్రము వైఖానసమై
గోత్రమ్మాత్రేయ మగుచు గూడగ, నిత్య
స్తోత్ర మొనర్చుచు రాముని
పాత్రుడనైనాడ మహిత పండిత కృపకున్!

# కిష్కింధ కాండ

భ్రాంతి భయములు గుండెలన్ - పరువులెత్త
భానుసుతుడిట్లు పలికెను వాయు సుతుని-
కనుగొనుచు దైన్యమున్ గని గద్గద స్వ
రమ్ముతోడ నతి రహస్యమ్ముగాగ

సుందరులు శూరులగువారు చోద్యముగను
కపలలన్ బోలినట్టి - ఆ ఘనులు కినిసి
అన్న పంపిన వారలే యనుచు తోచె
తెలిసి రావయ్య హనుమంత దివ్యతేజ

ప్రాజ్ఞుడవు బ్రహ్మచారివి పరుల యంత
రంగ విదుడవు నిజముగ రాణకెక్కి-
నట్టి దిట్టవు పోయి రావయ్య హనుమ
నీవు సర్వము గుర్తించు నిపుణమతివి

అనగ విని పావనాత్మన - ఆంజనేయు
డనియె నిట్టుల ప్రభువ! నేనరిగి వత్తు
వారలెవ్వరో నాకు సుపరిచితులుగ
కనబడుచు నుండె సత్యమ్ము గనుగొని యెద

అనుచు పర్వత సీమా సమావరోహ
ణమ్ము గావించి మోద బాష్పమ్ము లూరల
రామ లక్ష్మణులన్ గని రమ్య భక్తి
మోమునన్ వెల్గ కరములు మోడ్చి పలికె

రాజ్యమేలగ దగులకాణ్య సీమ
నేల తిరిగెదరయ్య భుజాల వ్రేలు
చాపములు సర్పతతిగ సాక్షాత్కరించి
బుసలు కొట్టుచు కనులకబ్బురము గొలుప

అన్నయనుమతి గొనిన లక్ష్మణన్న పలికె
వాయు సుతుతోడ - విధి బలవంతమైన
దయ్య! నెదిరింప నెవ్వరికైన దరమె
దశరథేశ్వరు పుణ్య సంతతికినైన

మాది యిక్ష్వాకు వంశంబు మాదయోధ్య
శ్యామలాకారుడైన శ్రీరాము డితని
అనుజుడను నేను లక్ష్మణుఁడంద్రు నన్ను
తండ్రి యాజ్ఞను శిరమున దాల్చి కలన

మారె పట్టాభిషేకంబు మాకరణ్య
వాసముగ తండ్రి యాజ్ఞయె శాసనముగ
మునుల రక్షింప దానవులను వధింప
కలిగె భార్యావియోగ మగ్రజున కిచట

సన్నిధిన్ మేము లేకున్న సమయమందు
నసురుడెవ్వడో జానకి నపహరించె
వాని చర్యకు గుండెలు వ్రయ్యలవగ
అన్న శోకాన మునిగి విషణ్ణుడాయె

ప్రత్యహంబు పరణ్య సీమల నిత్యమిట్లె
గుట్టలన్ పుట్టలన్ కొండకోనలందు
తిరుగుచున్నాము జానకికొరకు మేము
వెదకి వేసారి దీక్షను విడువబోక

కాననమ్మున జానకిన్ కానలేక
జాడ తెల్పెడి వారలు గూడలేక
వచ్చు తరిని జటాయువు వార్త దెలిపె
రావణాసురు దుష్ట చర్యను గురించి

చెనటుల వధించి యెల్లేని సీత చెరను
తొలగ జేసి, సుఖమ్ములు కలుగుచరకు
సాగు మాయాత్రి మధ్యలో సంభవించె
పావనుడవైన నీవంటివాని చెలిమి

నిన్ను జూచిన వెంటనే నిర్మలుడవ
టన్న భావంబు మామది నాక్రమించె
చెలిమికిన్ చేయిసాచి నీవలన కొంత
సాయమున్ గొన హృదయమ్ము సంబరపడె

చెప్పుమిప్పుడు నీ కథ - చిత్రమైన
స్నేహమున మాకు లాభమ్ము చేకురునని
మనసు విశ్వాసమున నుండె - మనకు మధ్య
సన్నుతంబైన బాంధవ్య మున్నయట్లు

దాశరథి! నేను నేటికి ధన్యతముడ
నీ పదస్పర్శవలన నా మేను పొంగె
అజ్ఞతన్ జేసి నేను మిమ్మార్య పుత్రి
యెవ్వరో యడిగితి క్షమియింపుమయ్య

నేను నీ పాదములు మదినిల్పి కొలుచు
మనసుగల అంజనాదేవి తనయుడనని
వందనము సల్పి వచియించు వాడ దేవ!
విన్నపము నాలకించుమో విబుధవర్య!

దాపునన్ గల కిష్కింధ భూపతియగు
పావనాశయుడైన సుగ్రీవుడుండె
అన్న దుర్బుద్ధి కడలి భయంబు కలిగి-
ఉండె నిచ్చోట నతనితో నుంటి నేను

వాలి దుర్మార్గుడని తోచె, వైరమూని
తమ్ము నేడ్పించు వాడని తలచినాడ
ఆర్తుడైన సుగ్రీవున కండయగుచు
కాలమాతని తోడనే గడుపుచుంటి

ఇరువురన్ గని కోదండ ధరుడవైన
నీవు వాలికి చెందిన నేస్తమవని
ఉలికిపడుచు సుగ్రీవుడపోహ పడెను
కాదనుచు నచ్చజెప్పి నే కదలినాడ

ఆ పదంబడి పోయి - అల్లాడి దుష్ట
భావనంబునకున్ దలపోంచినాను
నిరపరాధి సుగ్రీవుండు నిక్కువముగ
స్వామి! రక్షింపుడతని నా ప్రార్థన విని

మిమ్ములన్ గని మీ స్వరూపంబు గాంచి
కరుణగలిగిన యట్టి సోదరులటంచు
నెంచి సుగ్రీవునిపుడు నమ్మించి, మీ ప
దాబ్జములచెంత చేర్చితినయ్య నేను

హనుమ యందురు నన్ను నన్నాదరించి
రాగ భావమ్ము నన్ జూచి రామదేవ
వచ్చి నావెంట సుగ్రీవు భయము దీర్చి
కాపుమనుచును తలవంచి కాళ్ళుబట్టె

శిరము కరమున నిమురుచు చేరదీసె
హనుమ నప్పుడు రాముడత్యాదరమున
అన్న తమ్మునిపైన దురాగ్రహంబు
నేల వహియించెనో వచియింపు మనుచు

వినయ వినమిత దేహుడై హనుమ పలికె
అన్న తమ్ముని భార్యపై కన్నువైచి
పాము పగబూని సోదరు భ్రష్టుజేసి
పారద్రోలుటకన్న పాపంబు కలదె

మరదలిన్ గూడి ధూర్తుడై సరసమాడు
చుండె వాలి సుగ్రీవుడే యుండలేక
దీనుడై హీనుడై పరాధీనుడగుచు
కొండకోనల తలదాచి యుండె నేడు

కారణమ్మిది వేరైన కారణంబు
లెన్నియున్నను కనులముందున్న ఘోర
దృశ్యము సహింపలేక మంత్రిత్వమిపుడు
సలుపుచున్నాడ సుగ్రీవ సహచరుడగ

ధర్మమూర్తి! అకృత్యమ్ము, దర్పదృష్టి
ఈవు సహియింపవను మాట యే నెరుగుదు
అంతరంగమ్మునందు నాకట్లు తోచె
కనుక నీ సన్నిధికి జేర కదలినాడ

వెన్నుదట్టితి నేను విపన్నుడైన
యట్టి సుగ్రీవునకు మీరలహితులగుట
జరుగదని నిశ్చయమ్మున వరలుమనుచు
పలికి నీసాయ మర్థింప వచ్చినాడ

జానకిని వెదుక నడవుల సంచరించు
మీకు సుగ్రీవుడొక పాటి మేలుసేయ
గలుగు దక్షుడు వానికిన్ గలిగినట్టి
ఆపదన్ దీర్ప మీరలే అర్హులయ్య!

రామ సుగ్రీవమైత్రి, దుర్మార్గ చర్య
లకును స్వస్తిని బలుకు నాలక్ష్యమేల
రండు నావెంట సుగ్రీవరాజుకడకు
వచ్చు స్వాగతమొసగి మిమ్మాదరించు

భక్తి, భయ వినయమ్ముల ప్రబలజేసి
మిమ్ము పూజించునతడు నిత్యమ్ము, వాలి
వలన భయమించుకయు లేక కలతమాని
సాయమొనరించు మీకు నిస్సంశయముగ

రామలక్ష్మణు లిరవుగ ప్రేమ, భక్తి
వినయ భావములుప్పొంగ హనుమ పలుకు
పలుకులన్నింటి వినినారు తలపుపొంగ
అంతరంగాన నొకక్రొత్త ఆశ మెరయ

వారి యూహాలలోగల వజ్రతుల్య
మైన ఆలోచనల బలమద్దియేమొ
చిరునగవు మోమునందున చిందులాడ
చాపధరులౌచు హనుమతో సాగినారు

అంజనేయుడు సంబరమతిశయింప
తరలుచుండెను రామ సోదరులముందు
దూరమునుండి తిలకించి తొట్రుపాటు
వీడి సుగ్రీవుడానంద వివశుడయ్యె

హనుమ యుత్సాహభరితుడై యరుగుచుండె
వానివెంటనే నడచుచు వచ్చుచుండె
నన్నదమ్ములు మోద సంపన్నులగుచు
శత్రువులు వారుకారవ సాక్ష్యమదియె

కొండదిగివచ్చి సుగ్రీవుడంగా భక్తి
భావమున స్వాగతమ్మను బలుక నేమొ
నెమ్మొగంబున వెలుగొండ నిశ్చయమ్ము
మనసునిస్తుల సంతోషమగ్న కాగ

హానుమ దరిజేరుమండె నాహ్లాదమొదవ
సోదరులు ప్రకృతి శోభను చూచుకొనుచు
వచ్చుచున్నారు మెల్లగ వానివెంట
పురమునన్ గల కపులెల్ల మూగియునట్లు

రామలక్ష్మణులన్ గని రాగభావ
జలధి గుండెలలో పొర్ల సంబరాన
గంతులిడుచును నెగిరి కేరింతలిడుచు
వానరులు మొక్కె శిరమును వంచుకొనుచు

హానుమ వినిపించె వృత్తాంతమంతయును, వి
షాదమున నున్న సుగ్రీవు సముఖమందు
విన్న సుగ్రీవుడుత్సాహ విభవమొప్ప
మొక్కె వారికి కరములుమోడ్చి నిలిచి

శిరముపై చేయివైచి విశేషరాగ
భావమునుజూపి లాలించి భయముజెంద
నేను నీవాడ మనకిట నిరువురకును
మైత్రి ఘటియించె హానుమ, సమ్మతమువాకు

కష్టములను జయింపంగ కరము కరము
కలిపి మనమిరువురమిక కదలవలెను
భయము వదలుము మరల వైభవముకలుగు
కాలమే తెంచు మనశౌర్య గరిమికతన

తనువు నిమురుచు ప్రేమతో దాశరథి, వ
చించె నీరీతి సుగ్రీవుడించుకయును
నాలసింపక రామ పాదాబ్జధూళి
నొదలన్ బడుచుండ సాష్టాంగపడియె

అగ్ని సాక్షిగ మనమైత్రి యలరుగాక
హనుమ సాక్షిగ మన స్నేహమునకు కలిమి
బలిమియున్ కల్గుగాక యెప్పట్లనేని
అద్భుత జయమ్మె మన వశమగునుగాక

ఆంజనేయుని కన్నులందనుపమాన
దివ్యతేజో విశేషము దీప్తమాయె
కనులనానంద రేఖలు కదలుచుండ
కీశపతియైన యట్టి సుగ్రీవుడలరె

మీరలీరీతి కొండపై చేరియుంట
కేమి కారణమను రాఘవేంద్రుడడిగ
అధిక వేదన కలుగ శోకాంగుడగుచు
పలికె సుగ్రీవుడా రామభద్రుతోడ

ఇంద్ర వంశమ్మునన్ జనియించె వాలి
భాస్కరాంశాన బుట్టినవాడ నేను
అన్నదమ్ములకున్ శాపమమరుకతన
కీశ రూపమ్ము వచ్చె కిష్కింధ మాది

అన్న బలవంతుడగుట రాజ్యాధినేత
యాయె మేమందరము వాని యనుచరులము
మంత్రులము సైనికులము సామంతులమును
గడచుచున్నది యీరీతి కాలమెట్లో

ఒక దినంబున దుందుభి యుగ్రబలుడు
దానవుండు, కామాంధుడు తరలివచ్చి
పిలిచె రణమొనరింప మమ్ములను - వాలి
వెడలె ముందుగ, వానిపై విక్రమింప

వాని హతమార్చె మాయన్న బలముజూపి
అతని తమ్ముండు మాయావి యాగ్రహమున
మాపయిన్ బడె కనలిన మాయనుజుడు
వాని వెంటాడి బిలములోపలికి నెట్టె

పంచదశ దినములుజూచి బయటికేను
రానిచో నాశపడలి బిరాన నీవు
మరలిపొమ్మని నాకొక మాట చెప్పి
వెడలె మాయన్న మాయావి వెంటనంటి

అట్లె పదమూడు దినములయ్యద్రి బిలము
చెంతనె నిరీక్షణమ్మునే జేసినాడ—
ఆర్తనాదమ్ము వినబడె నా బిలమ్ము
నుండి రక్తమ్ము ప్రవహించె - గుండెలదిరె!

అన్న గతియించె ఫలితమ్ము సున్నయనుచు
శత్రువును బిలమందె నాశనమొనర్ప
ధైర్యము వహించితిన్ మమతన్ త్యజించి
బండనడ్డుగ బెట్టితి బయట బడితి

నాటినుండి కిష్కింధకు నాథుడనయి
పాలనము సల్పుచుంటిని భద్రముగను
అనుకొనిన దొక్కటియు జరిగినది యొకటి
కాగ - ఒకనాడు, సాక్షాత్కరించె - అన్న!

వైరి మదమడగించి యవ్వాని జంపి
బంధనొక కాలదన్ని తా బయటబడియె
అన్న నాపైన పగబూని - అరుగుదెంచి
కన్నెరుపెక్క నాదెసగాంచి పల్కె

ధూర్తుడవు వంచకుడవు నా తోడబుట్టి
నట్టి చాడవెగాని మాయావి యనుచు
నా **సతిన్** స్వీకరించి తన్నంగ బూనె
తమ్ముడను దయమాని - వాస్తవము స్వామి

నాపయిన ప్రేమగలవారు నన్నుగూడి
వెంట జనుదేర కిష్కింధ వీడివచ్చి
దిక్కుతోచక నీరీతి దీనుడనయి
కనలుచుంటిని ఋష్యమూకంబు నందు

దుందుభి శిరమ్ము వాలిచే దునుమబడిన
పిమ్మటన్ కాలితోతన్ని విసరబడగ
నిచటబడియె మతంగ మునీంద్రుపైన
నమ్మహర్షి కఠోర శాపమ్మొసంగె-

ఇది విసరినట్టివాడు తానెన్నడేని
ఇటకు చేరిననాతడు నిల్లె శిరము
పగిలి గతియించునన్న శాపంబు విన్న
వాలి యిక ఋష్యమూకంబువంక జనడు

కాన నిబ్బరముగ నేను కాలమెట్లో
గడుపుచున్నాడ మీవంటి ఘనుల దర్శ
నార్థమై వేచియుంటిని - అంతరంగ
మందు భయమనుమాట రవ్వంతలేక

ఆకస్మాత్తెవ్వరో వచ్చి సాయమ్ము సలిపి
నన్ను కాపాడ గలిగెదరన్న నమ్మ
కమ్ముతో నేటివరకు జీవమ్ము నిలుపు
కొంటి ఫలియించె స్వామి నాకోర్కె నేడు

కనులు చెమరింపజేయగ గలుగుగాధ
మీకు వినిపించినాడ నా మేలుగోరి
చేయుగలిగిన సాయమ్ము సేయుడయ్య
దీనుడను మీ ఋణమ్మును దీర్చుకొందు

హనుమ పరిచయ మొనరించునపుడు తమకు
గలిగినట్టి మహాపద గలత బెట్టె -
నా మనమ్మునకున్ స్ఫురణకును వచ్చె
గత దినమ్ముల జరిగినగాధ యొకటి

కపుల మొకనాడు ఋష్యమూకంబు పైన
నున్న తరి గగనమ్మున నుండి - అబల
ఆర్తనాదమ్ము వినిపించె నంతలోన
పడియె మా మధ్య బిగగట్టి పసిడిమూట

అంబరమున విమానమ్మునందు నుండి
జానకిని, రాముసతిని, నాస్వామి కెవ్వ
రైన రావణుడిట్లు నన్నపహరించె
ననుచు చెల్పుడు మీకు పుణ్యంబు కలుగు

మాకు శోకాలమధ్య యీ మాటలిట్లు
వినబడియె - పసిడిమూటను విప్పకుండ
దాచియుంచితి మిప్పటివనుక మేము
రావణు విమానమరిగెను లంకవంక

మీరు, చూసిన గుర్తింప నేరగలరొ
యేమొ యనునది మామదికిపుడు తోచె
ననెడి సుగ్రీవు పలుకుల నాలకించి
రాముడును లక్ష్మణుడు నబ్బురమ్ము గనిరి

మనసు నిబ్బర మొనరించు కొనినయట్టి
వారు తప్పక సీత కావచ్చుననెడి
నమ్మకముతో కపీంద్రు స్నేహమ్ము కోరి
అగ్ని సాక్షిగ కలిపిరి హస్తములను

అలరె సుగ్రీవ హృదయమా హ్లాద భరిత
మగుచు, శ్రీరాము నెయ్యంబునందు కతన
మ్రొక్కె శ్రీరామ పాదాబ్జములకు వినయ
వినమిత శిరస్కుడగుచును వివశుడగుచు

భటుల బంపించి తెప్పించె పసిడిమూట
దాశరథి విశ్వసించి ముదమ్ము నొంద-
"స్వామి! మూటను విపదీసి సర్వభూష
ణముల గాంచుడు మీరు జానకివొ కావొ!

అవ్వి నిజముగ జానకీవైన యెడల
అవలి యత్నంబునకు మీరాజ్ఞ యిడుడు
శిరమునన్ దాల్చి వర్తింతు చెప్పనేల
వాలినుండి రక్షణము కావలయు" ననెను

దాశరథి నవ్వి నీకు భద్రమ్ము కల్గు
నింక సుగ్రీవ సందేహమేల నీకు
మిత్ర ధర్మమ్ము మనమది మొదలువరకు
మేము నీవును నొకటిగ మెలగగలము

పరవశించెను సుగ్రీవు భావసరళి
కపుల సంఘమ్ము మోదమ్ము గనపొంగ
జన్మ సఫలత గనినట్టి చందముగను
హనుమ సంబరమందుచు నాడెనపుడు

దుష్టభావంబు లెపుడేని తూలుననుచు
మంచి యెప్పటికైన జయించు ననుచు
ధర్మమునకె లభించు భద్రతయటంచు
రామ సుగ్రీవ యుగమైత్రి రక్తిగూర్చె

సాధుమూర్తులు సజ్జనుల్ సత్పురుషులు
నొకరికొక్కరు మైత్రితో నున్నయపుడె -
అక్రమంబుల గూల్చివేయనుచు తెలిపి
రామ సుగ్రీవ యుగమైత్రి రాణకెక్కె

రామునాజ్ఞను గైకొని ప్రేమ భక్తి
భావములు పొంగనపుడు సుగ్రీవ విభుడు
పసిడి నగలమూటను దెచ్చి పలువురికడ
విప్పి గుర్తింపుమని రామవిభుని కోరె

అపుడు శ్రీరామదేవు నేత్రాంచలాల
కదలె కన్నీటి కణము లుత్కంఠ మెరయ
దాశరథి దీనుడగుచు వత్సలతజూపి
పలికె నీలీల గద్గద స్వరము తోడ

లక్ష్మణునిపైన చెయివైచి రాగభావ
భరితుడగుచును నగలపై బరపె దృష్టి
కనగజాలను తమ్ముడా కాంచు నీవె,
అనుచు కన్నీటిని తుడుచుకొనుచు ననియె

అతడు లక్ష్మణు డన్న పాదాబ్జసేవ
యుండె - ఆనంద భావంబు నందువాడు
అన్న యాజ్ఞనె యతడు వేదాజ్ఞయనుచు
నిర్వహించు శిరమ్మున నిశ్చలముగ

వరుస వరుసగ నగలను తిరుగవైచి
కానెకాదిది, కాదిది కాదటంచు
అన్నిటిని జానకివి కావటంచు పల్కె-
మిగిలె నూపురములు రెండు నగలయందు

దాని కనుగొని తన్మయత్వమున మురిసి
హర్షమున కేక వేయుచు నవిగొ నవియె
జానకీ నూపురములనె సంబరమున
గద్గదిక తోడ గైకొని కనుల కద్ది

ఇచటనే భారతీయ సంస్కృతి రహించె
ఇచటనే ధార్మిక జ్యోతి యింత వెలిగె
నిచటనే వేద సంస్కారమింత మెరిసె
నిచటనే మరది వదినకు నిత్యజోత

ఇది పురాతన ధర్మంబు నెల్లకాల
ములకు ప్రవహింపజేసెడి పూజ్యగంగ
ఇది మహోజ్జ్వల సంస్కార పదము నరుల
గుండెలో నాటు వైభవాంకురము సుమ్మ

అసలెరుంగను వదిన కంఠాభరణము,
నెరుగ కేయూరముల, నసలెరుగ, కంక
ణముల, తెలిసినవీ నూపురములె నాకు
వందనము నిత్యమొనరించు వాడనగుట

అనుచు కన్నీరు నించుచు నదర పెదవు
లిట్లు సౌమిత్రి వివరించుటెరిగి యచటి
కపుల, శ్రీరామ చంద్రుని కనులుగూడ
తడిసె వాక్కులు రాక తత్తరము జెంది

ఇద్ది వదినకు మరదికి నిద్దరకును
మధ్య నుండగవలసిన మాననీయ
మైన భావనయనుచు వారందరొక్క
మారు చెయ్యెత్తి మ్రొక్కిరా భావమునకు

మాన్యుడీ లక్ష్మణుడు సుమా శ్రమింప
గోరి యరుదెంచె నన్నతో గూడి వనికి
వదినపై నీయనకుగల భక్తి నిరుప
మమ్ము నిస్తులమగుచు గణ్యమ్ముగాదె

అనుచు కపులందరాత్మలో నతిశయించి
నట్టి భావాన లక్ష్మణు నాదరింప
లక్ష్మణుని చేతగల నూపురముల గాంచి
వివశుడయ్యెను శ్రీరఘు వీరుడపుడు

స్వామి! శ్రీరామ! నగలు సాక్షాత్కరించె
గాన జానకిగూడ క్షేమాననండు
త్వాదృశుల కెన్నడున్ విషాదమ్ము తగదు
మీకు వివరించు శక్తియు మాకులేదు

అమ్మ కనిపించు మనకు నిక్కమ్ము, వలదు
దుఃఖభారమ్ము నికమీద తొలగద్రోసి
ముందు వాలిని హతమార్చి ముదముగూర్చి
నాదు సేవలనందు కొనంగ రండు

మిమ్ము నమ్మితి తప్పక మీ వలననె
వాలి బాధయు నాకు నివారణమ్ము
కాగలదటంచు నల్లె మాకపుల సాయ
మమర జానకి కనిపించునయ్య నిజము!

వాలినిన్ జంపు శౌర్యప్రభావ గరిమ
కిదియె సాక్ష్యమ్ముగా వచియించినారు
ఇచటగల సప్తతాళమ్ము లెల్ల నొక్క-
పరిగ గూల్పగవలె రామభద్ర యనుచు

విన్న శ్రీరాముడుత్సాహ విభవుడగుచు
నవ్వి సంధించినాడు బాణమ్మొకండు
విడువ తాళమ్ము లేడును బడియె ధరను
చేరెను శరమ్ము రాముని చెంతకంత

దీనికనుగొని సుగ్రీవుడూనె దీక్ష
రాజ్యలక్ష్మిని గెల్తు శ్రీరాము కరుణ
ననుచు నుప్పొంగుచున్ కపులాడి పాడ
దిక్కులన్ రామనామమే పిక్కటిల్ల!

రాముడంతట సుగ్రీవు ప్రేమమీర
దగ్గరకు పిల్చి స్నేహబంధమ్ము బిగియ
మిత్రమా! భయమేటికి మేముగలము
విశ్వసింపుము విజయమ్ము వెలుగుగూర్చు

అంత సుగ్రీవుడనియె మీ యాదరణకు
వేయి వందనముల నిదె చేయువాడ
మీరలిరువురు సుఖముగ జేరి యిచట
మాకతిథులౌచు నిక మీద మసలవచ్చు

సమయ సందర్భములు గని శక్తిజూపి
వాలి వధింపవచ్చు నీవాడనైన
నాకు సాయమ్ము సలిపి - అన్యాయములను
మీరు సరిదిద్దవచ్చును మేలుగూర్చి

కీశపతి ప్రార్థనమ్ము నంగీకరించి
రామలక్ష్మణు లిరువురుద్దామ బలురు
సీత నన్వేషణ మొనర్చి స్నేహధర్మ
సంపదను పెంచుమనుచు నచ్చట వసించె

కాలము క్రమక్రమమ్ముగ గడునదోడగ
వాలికీవార్త తెలిసె, వివాదదృష్టి
పెరిగ సుగ్రీవుతోడ, సోదరులమధ్య
ఆగ్రహాగ్నుల వేడిమి - అతిశయించె

పోయి సమరమ్ము సల్పగ పూనుకొనుము
నేను వెన్నంటి నిల్చెద నీకు జయము
తప్పక లభించు, వాలి విధ్వస్తుడగును
దాశరథి యీ విధముగ బోధన మొనర్ప

వినియు ధైర్యమ్ము చాలక వినని పగిది
రామభద్రుని సేవలో రాత్రి పగలు
గడుపుటయె ధైర్యమునకిక కారణమని
తలచి సుగ్రీవుడారీతి సలుపుచుండె

దాశరథి వెన్నుతట్టి పథమ్ముజూపి
ముందునకు నెట్టె సుగ్రీవు, ముందుకురికి -
అన్నచేత తన్నులన్ దిని యదరిపడుచు
వచ్చి రాముని పాదాలవద్ద వ్రాలె

భయపడకుమోయి సుగ్రీవ భయపడకుము
మీరలోకలీల నుండెడి వారలగుట
జేసి వాలిని నే వధ జేయలేదు
తారతమ్యమ్ము మీ యెడ, దనరవలయు

ప్రధనమునకీవు సిద్ధమై వచ్చువేళ
గళమునందు హారమ్మునొక్కటి ధరింప
వలయునప్పుడు గుర్తింప వలనుపడును
వాలిని వధింప హేతువై వరలునదియె

రామచంద్రుని వాణి కర్ణమునబడిన
యంత సుగ్రీవుడానందమంది, మ్రొక్కి
స్వామి! మీయాజ్ఞ నౌదలవంచి - ఆచ
రించెదనటంచు భక్తి వచించెనపుడు

తదనుగుణముగ మరునాడు దండనొకటి
గళమునన్ దాల్చి నిప్పులు గ్రక్కుకనులు
రణమొనర్పగ సింహాగర్జన మొనరిచి
పిలిచె వాలిని సుగ్రీవు డలుకఃబాని

ఆ మహోగ్ర ప్రచండ నాదాంతరమున
వరలు సుగ్రీవు సాహసం బెరిగినట్లు
తార ప్రార్థించె నాథు పాదాలుపట్టి
నేడనికి నేగవలదని నిలువరించి

మీరనిన దూరముగ నేగి మిక్కుటముగ
భయమునందు సుగ్రీవుడు భయము వదలి
సింహానాదంబు నేడిట్లు సేయఁగడగె
కారణమ్మూహ సేయు డాగ్రహము వీడి

ఇట్టి విపరీతమును మనమెన్న డేని
గతమునన్ గాంచితిమె? పరిస్థితినిబట్టి
యెవ్వరో అండగా నిల్చి యితని వెనుక
చేరి నడిపించుచున్నట్లు తోచినది నాకు

కానిచో వానికీ పాటి కండకావ
రమ్ము జూపింపగల హృదయమ్ము గలదె?
ఆ బలమ్మెట్టిదో వానికట్లు వెన్ను
చరచి నిలిపినవెవ్వరో యెరుగవలయు

ఏమి యీ గర్జనము మునుపెన్న డేని
యిట్టి మగటిమి జూపెనే యితడు, కోరి
అనికి దూకెనె, తాను నేత్రాంచలముల
నగ్ని కణములనుమిసెనె, - అరయవలయు

వలదు వలదు రణమ్ము నేడలుక మాని
సత్య పరిశీలనము సల్ప సాగుడనుచు
తార వాలిని ముందుకు తరలనీక
వినయనయ భయచిత్తయై వేడుకొనియె

వానిదొక సింహనాదమా? వాని వెనుక
మరియొకడు నిల్చియుండెనా! మానిని యని
పగలబడి నవ్వె వాలి యాపలుకులు విని
తార గుండియలన్నియు జారిపోవ

దారికడ్డము నిలుపక తప్పుకొనుము
వాని మదమణగించి - ఉజ్జ్వల జయమ్ము
నందువాడను నిస్సంశయమ్ము తార -
అనుచు ముందుకు వాలి రయమున నరిగె

ఆగ్రహమ్మున భుజము తానప్పళించి
కన్నులురుముచు సుగ్రీవుకున్న కడకు
వాలి గదబూని యరిగె నవార్య విక్ర
మాతిశయమున నధరములదరి పడగ

వచ్చియున్ రాకముందె గర్వమ్ముతోడ
యేమిరా యింతవాడవై యిట్లు నన్నె -
అని నెదుర్కొనవచ్చితే యనుచు వాలి
దూకె సుగ్రీవుపైకి చికాకు పడుచు

గదను గిరగిర త్రిప్పుచు కదనమునకు
సంకురార్పణ మొనరించి - ఆగ్రహించి
వాలి సుగ్రీవుపయి తన పౌరుష ప్ర
చండ బలమును జూపింప సాగనపుడు

నిరుపమ గదా ప్రహారముల్ నిబ్బరముగ
తట్టుకొనుచు సుగ్రీవుండు ధైర్యమూని
సలుపసాగె రణమ్ము దాశరథి వెనుక
గలడటన్న విశ్వాసమ్ము బలము బెనుప

తూలి పడిపోవుచును నిలదొక్కు కొనుచు
అన్న ఆగ్రహవహ్నితో నదరిపడుచు
జీవముల నిలుపుకొనుచు సుగ్రీవుడపుడు
రాము సాయమ్ముకోరి పోరగ దొడంగె

నన్నెదుర్పగ బ్రహ్మకైనను దరంబె
వాలి తలపడినపుడు కాపాడువారు
కలరె సుగ్రీవుననుచును కన్నులెఱ్ఱ
వార పోరాడదొడగెను వాలియపుడు

భూమి కంపించె వారలు బొబ్బలిడగ
వాలి యుగ్ర గదాఘాత వైఖరులకు
వృక్ష సంతతులెల్ల కంపించుచుండె
పక్షి తతిరెక్కలల్లార్చి పారిపోవ

గగనచారులు సముచితోత్కంఠతోడ
జూచుచుండగ, వానరుల్ చోద్యమంద
సాగినది వాలి సుగ్రీవ సంగరమ్ము
ప్రళయ భీకరమగుచు దిగ్భ్రాంతి గొలిపి

హుమ్మనగ వాలి సుగ్రీవుడుమ్మగిల్లి
బలము సర్వమ్ము నేకత్ర పదిలపరచి
అన్న నెదిరింప సంసిద్ధుడగుచు నుండె
కాని తా వెనుకకు తగ్గి కనలుచుండె

పళ్ళు పటపట కొరుకుచు ప్రబల రోష
వహ్ని మోమున ప్రజ్వలింపగ భయంక
రాకృతిన్ గొని వాలి తాననుజుమీద
కురక సాహసమొనరించు చుండెనపుడు

దయ యెరుంగని - అన్న క్రోధంబుగాంచి
తమ్ముడు భయమ్మునన్ తహతహలు జెందె
భీరువై తప్పుకొనలేక పోరుచున్న
తమ్మునిన్ గని - అన్న మోదంబునొందె

ప్రతి గదాప్రహరణకును బదులుచెప్పి
జీవితము నిల్పుకొనుచు సుగ్రీవుడుండె
కరుణ లేశము కన్నుల పరలనీక
మోదుచుండెను తనగదబూని వాలి

తనబలము జూపువరకు నా ధనువునెక్కు-
పెట్టు పనియేలనని రఘువీరుడుండె
వచ్చె రఘురాము దివ్యాస్త్ర వహ్నియని ని
రీక్షణము సల్పె ననుజు డనుక్షణంబు

వాలియత్నమ్ము నిసుమంత వదలలేదు
యెదురు చూచుచు తమ్ముడు కదలలేదు
యేలనో దాశరథి ధనువెత్తలేదు
సాగుచున్నది కాలమీ సరణినపుడు

ఘోరసంగ్రామ లీలకు క్రూరజంతు
జాలములుగూడ భయపడి సాగిపోయె
దూరదూరాలకపుడు నిస్తుల మహోగ్ర
రణమొనర్చిరి సోదరుల్ వెనుదిరుగక

వాలి బలము విజృంభించు వైఖరులను
జారిపోయెడి సుగ్రీవు శక్తి నిగని
సమయమని దాశరథి శరాసనమునుండి -
అమ్ము లాగెను ధనువు నందమర జేయ

పాపమిప్పుడు పంటకువచ్చె నోర
సోదరద్రోహి నీలావు జూపుమింక
దాశరథి బాణవహ్నిలో దగ్ధుడవయి
కూలిపోవ సమీపించె కాలమింక

అనుచు కనులెఱ్ఱవడ నాగ్రహంబు పెరుగ
జంతువధ వేటగాడెట్లు సలుపునట్లు
రాముడుగ్ర స్వరూపుడై రణమొనర్చు
వారిలో గురిచూచినవ్వాలి గొట్టె

జానకీపతి శరము ప్రజ్వాల దనంత
వహ్నికీలలు గ్రక్కుచు వచ్చిపడియె
వాలి యురమున, సుగ్రీవ భావమలర
వాలి వృక్షంబువలె ధరపైన గూల

ద్రోహభావన గెలువదు దుడుకుతనము
చెడుగు చేకూర్చు హితుల సంక్షేమ మరయ
జాలనపుడు పరాక్రమశాలియైన
వాలివలె నెవ్వడేనియు వసుధగూలు

దర్పభావమ్మునన్ సహోదరునిగూడ
కష్టముల పాలొనర్చి, దుష్కముడెపుడు
గాంచునే భగవానుని కరుణయంత
వాలివలె కాలగర్భాన తూలిపడక

ధరణిపై వాలి గిలగిల తన్నుకొనుచు
కన్ను మూయకముందె రాఘవుడు జేర
నతని చెంతకు, వాలి రామాకృతి గని
వానితో మెల్లగా తడబడుచు పలికె

రామ! ద్రోహమ్ము నేను నీకేమి చేసి
నాడ తమ్ముడు దగ్గరవాడె నీకు
నాపయిన్ పగబూని - అన్యాయమునకు
నడుము గట్టితివిది యెట్టి న్యాయమయ్య

రామ! ఒకమాట చెప్పిన రావణునకె
కబురుపంపించి జానకీకాంత నిటకె
చేర్చువాడనె నాతోడి స్నేహమునకు
నీవు పూనిన - పొరపడినావు నిజము

నీకు సాయమ్ముగా నేను నిల్చినపుడు
నీక సాధ్యమ్ము లేదింక లోకమందు
కాని వాస్తవ మరయుటమాని నన్ను
శత్రువుగ జూసినాడవు శరము వదలి

ధర్మమూర్తివటంచు పెద్దగ ప్రశంస
లందుకొన్నట్టి నీయశమలము కొనదె
ఈ కిరాతక చర్యతో నింతమచ్చ
భ్రష్టమైపోదె యిక్ష్వాకు వంశకీర్తి

నిన్ను దైవంబటంచు వర్ణించినట్టి
మునుల ప్రవచనలీలకు ముప్పురాదె
నిరపరాధుల దండించు నీ పరాక్ర
మాతిశయమునకిది - అపయశముగాదె

ధర్మరక్షణ కొరకయి ధరణి నవత
రించినానను టయు మోసగించుటాయె
వాలికథ సర్వమున్ విన్నవార లెవ్వ
రేని నిను ధర్మరక్షకు డెట్లనెదరు?

నిన్ను భగవానుడనుచును సన్నుతించు
వారలీవాలి కథవిని వంచుకొనరె
తలలు దశరథరామ యింతకు తెగించి
పాడుపని సల్పినావు మావాడికొరకు

వాడు నీకొరిగించిన పైనమేమి
నేను తలపెట్టినట్టి మన్నింపరాని
ద్రోహమేమి? నిజమ్మనే - ఊహసేయు
దక్షతయులేని నీవెట్టి దైవమగుదు?

మున్ను రావణుడొక్కడే మోసగించె
ననుచు విలపించుచున్నాడవయ్య నీవు
మంచి మాటలతోడ వంచించె నేడు
మరల తమ్ముండు రెండవమారు నిన్ను

వాడు నిజముగ నీకొనర్పంగ దగిన
సాయమున్నదె? కడకు నీశక్తి నద్దు
పెట్టుకొని నన్ను గెల్చు వివేకియగుచు
ఇట్టి పనిని నీచేత చేయించి మించి

అనుచు నిర్దోషివలె వినయాతిశయము
వరలనేమేమొ పల్కెడు వాలినిగని
దాశరథి ఫాలభాగాన తాండవించె
నర్థవంతమ్మయిన దరహాస రేఖ

వాలి! నిను గూలనేయుట వాస్తవముగ
రాచరికమునకొక్క ధర్మంబుగాదె
దుర్గమారణ్యములగల దుష్టజంతు
తతిని గూల్చుట క్షత్రియ ధర్మమెగద!

నీవు వనచరుడవుగాన నిలిచి చెట్టు
వెనుక తెగటార్చుటయు ధర్మవిధియెయగును
చెప్పదలచిన నెన్నియో చెప్పవచ్చు
నీవు సలిపిన దోషముల్ నిక్కవముగ

తనయవంటిదె మరదలు దానిపైన
కన్నువైచుట చెరచుటకాదె దోసగు
అగ్రజుడు తండ్రివంటివాడగుట యెరిగి
తమ్ముని - తరిమివైచుట ధర్మమగునె

వరుసగా నిట్లు వచియింప వలసినపుడు
కలవు దుర్మార్గములు నీవు సలిపినట్టి
వెన్నియో, యెన్నియో యిక యేల వాద
మిచట నింత ప్రశాంతి వహింపుమింక

అనుచు రాముడు పలుకుచున్నట్టి పలుకు
లెల్ల వినుచు సుగ్రీవుండు తెల్లబోయి
గతమును స్మరించి యెట్టి వాక్యమ్ముగూడ
పలుకనేరక మానబాష్పములు వదలె

వందనముసల్పి రఘువీరువంక చూచి
స్వామి? మీరొనరించిన సర్వసమ్మ
తమ్మయిన కార్యమెల్ల ధర్మమ్ముగాదె
కాదనుచు నెవ్వరన్నను కల్లగాదె

మీరు వైకుంఠమును వీడి ధారుణి పయి
నవతరించిన నారాయణాంశకాదె
సత్యరూప మీవాక్యమ్ము సత్యమెయగు
నన్ను మన్నించిగొనుడు ప్రణామములను

నీవు కరుణాపయోధివి నిక్కమముగ
నన్ను మన్నింపగలవు నా విన్నపమ్ము
నాలకించి క్షమించి నాయాత్మజునకె
పట్టమున్ మీరె దయయుంచి కట్టవలయు

అన్యమెరుగని సాధ్వి యర్థాంగి - ఆమె
క్షేమమున్గోరి యేర్పాటు సేయవలయు
మీరె - రఘురామమూర్తి యీ కోరికల స
మాదరింపగవలయు దేవాదిదేవ!

అనుచునప్పుడు వాలి రామయ్య పాద
పద్మములపైన తలవాల్చి ప్రార్థనమ్ము
సలిపె నిర్మలమగు మానసమ్ముతోడ
కలుషభావమ్ము సర్వమ్ము కరిగినట్లు

అభయ హస్తమ్ము వాలికత్యాదరమున
నొసగి - అంగదు బిలిపించి యోర్పునేర్పు
గదుర సుగ్రీవుచేత తక్షణము వాలి
కనులయెదుట పట్టాభిషేకమ్ము జరిపె

అంగదుడు యువరాజ్య పట్టాభిషిక్తు
డగుట వాలి మనంబున హర్షమొదవె
వాని భార్యను గౌరవ భావమలర
గొల్తునని తమ్ముడన వాలికొరత దీరె

కనులుమూసిన వాలి కంగదునిచేత
సర్వమున్ జరిపించె దాశరథి - అంగ
దునకు సుగ్రీవుకోడ బంధుత్వమమరె
కీశపతి యగుచు మెరసె సుగ్రీవుడపుడు

మంచి పరిణామములను రప్పించినట్టి
పుణ్యమూర్తికి రఘువంశ పుంగవునకు
సర్వవానర లోకమ్ము సంబరమున
రామ జయరామ జయమంచు రక్తిజూపె

కదలిరందరు ఋష్యమూకమ్ము కడకు
గతము నంతయునొక పీడకలగ మరచి
వనచరులగూడి సుగ్రీవ వల్లభుండు
రాజ్యమేలుచు మరచెను రాముమాట

తాను ప్రత్యుపకారమ్ము దాశరథికి
సలుపవలసిన విషయమ్ము సంస్మరింప
నేరడాయె వానరపతి యేరుదాటి
తెప్ప నే విస్మరించెడి తెరగుదోప

* * * *

అది శరత్కాల సమయమయ్యెది ప్రసన్న
ప్రకృతి లీలావిలాస విభ్రాజితమ్ము
కనులపండువ గలిగింప జనులు మురియ
పండువెన్నెల భువిపైన బరుగువేళ

వీరులు రణమ్ము సలుపగగోరి ముందు
నకును దూకెడి సమయమైనను, సమధిక
వర్షములు తగ్గినను గాని - భద్రత గని
కులుకు సుగ్రీవుడిది మది - తలపడాయె

మాట యిచ్చిన మేరకా పాటికపుడె
రామకార్యార్థమై దిక్కులకును కపుల
బంపవలసిన బాధ్యత పైనగలిగి
యుండి పలుకక నులుకకనుండె నతడు

రాముడు సహించె నీస్థితి ప్రేమమూర్తి
యగుటకతన - సుగ్రీవు దురాతిశయము
సహానమును చూపలేనిదై జ్వలితవహ్ని
పగిది రగులుచు రగులుచు భగ్గుమనియె

మద్యపానమ్ము గావించి మదవతులను
గలిసి సరసాల ఋష్యమూకమున దేలు
మతి విహీనుడు సుగ్రీవు మదమణంచ
బూనె సౌమిత్రియే బుద్ధిపూర్వకముగ

ఒక్క సమయాన దిక్కులు పిక్కటిల్లు
పగిది సౌమిత్రి శంఖారవమ్ము సలిపె
వినిన సుగ్రీవు గుండెలు వ్రీలిపోవ
కపులు కంపింప ఋష్యమూకమ్ము బెదర

తన పనులు దిద్దుకొనినాడు - తనను తాను
మరచి - సౌమిత్రి మగటిమి మరచినాడు
వీని క్షమియింపననుచు దవానలమ్ము
క్రమ్మ నటు సాగి ఋష్యమూకమ్ము జేర

వచ్చి యచటికి పిడుగులవాన లీల
గర్జనము సల్పుటయును శంఖారవమ్ము
సేయుటయు విని లక్ష్మణుచేష్ట యిద్ది -
అనుచు భయపడి తార తాననియె నిట్లు

జరిగిన మహోపకారమున్ సంస్మరింప
జాలక మహాపరాధమ్ము సలిపినావు
మద్యపాన లోలుడవౌచు - మాన్యులైన
వారి కెగ్గౌట కడకు శాపముగ మారె

లక్ష్మణుండాగ్రహింప నిలాతలాన
రక్షణయె లేదు నీకు పరాకుమాని
త్వరితగతినేగి వాని పాదాలుబట్టి
దోషిని క్షమింపమనిన సంతోష మొదవు

వాడిగా సూటిగా తార వాస్తవమ్ము
నిట్లు వివరింపగన్ - తలకెక్కినట్టి
మత్తుదిగిన సుగ్రీవుండు చిత్తమందు
జంకుచున్ చేరబోయె లక్ష్మణునికడకు

కనులు నిష్పాకణంబులై, కనెడి వారి
కనులకు భయమ్ము గలిగింపగను సుమిత్ర
తనయుడుండె - సుగ్రీవుండు దరికి జేరి
భయపడుచు పాహిమాం పాహి పాహియనుచు

స్వామి దోసంబు జరిగెను రామచంద్ర
మూర్తి, కార్యమునొడల మోయుచట్ల
సర్వమున్ ధారవోసి నిస్సంశయముగ
రాము ఋణమీగ గలవాడ లక్ష్మణుండ

మీరలీరీతి నాపయి దారుణమగు
క్రోధమూనిన రక్షింప గోరరెవరు
నన్ను - సౌమిత్రియనుచు ప్రణామమిడుచు
వంచె తలను సుగ్రీవుడా పన్నుడగుచు

గతమును స్మరింపవలదు లక్ష్మణా! మహాప
రాధినగు నన్ను క్షమియించి రాముసేవ
సలుప నాజ్ఞనొసంగుడు సత్వరమ్ము
ఆచరణయందుబెట్టి ధన్యత గడింతు

ఇది శరత్తు రణమ్మున కదను, దెసల
నమ్మ నన్వేషణ మొనర్ప ననుసయిన ప్ర
శాంతమైనట్టి - అనుకూల సమయమిద్ది -
ఆగ్రహమ్మల క్షమియింపుడయ్య నన్ను

నేడె కపులను రప్పించి నిబ్బరముగ
సభను జరిపించి వారినుత్సాహపరచి
సైన్య విభజన మొనరించి సర్వదిశల
కంప యత్నమ్ము సలిపెద నాజ్ఞయిడుడు

చతురమతులు మహా బలోత్సాహయుతులు
కలరు, కపిసైన్యమున మారు ఘనులు, వేల
సంఖ్యలో వారెరుంగని జాడ లెవ్వి
యుండ వియ్యది సత్యమై యుండ నెపుడు

జాంబవంతాది ప్రముఖులు సముచితమగు
భక్తిభావాన రాముని బంటులగుచు
సైన్యముల నడపించి దుర్జనుల నణచి
జయము సాధింపగలరు నిస్సంశయముగ

పరమ విశ్వాసపాత్రుడై బలముజూపి
సాహసమ్మున మారుతి సప్తసాగ
రముల కవ్వల నున్నను రామదేవు
సతిని గనుగొన గలడింక సంబరాన

ఈ ప్రమత్తతనిక క్షమియింపవలయు
నెవ్వరెవరెట్టి ధైర్యమ్ము నిపుడుజూపి
రామ కార్యమ్ము సలుప నుల్లాసపడెద
రవ్విధంబును గనుగొన నదనువచ్చె

రేపె కపి సైన్యముల జేర్చి లీల నాల్గు
దెసల విహరించి జానకీదేవి వార్త
నరయ విభజన మొనరించి యంపువాడ
నన్ను మన్నింపుడనుచు ప్రణామమిడియె

తలపునన్ గల - అలసత తొలగ, గుండె
లదర కపినేత రామకార్యార్థియగుచు
విక్రమించుట గమనించి సక్రమముగ
నన్నియు జరుగవలెనని - ఆజ్ఞయిడుచు

వినుము సుగ్రీవ! నీయున్న విక్రమమ్ము
వమ్మొనర్చిన రామబాణమ్ము నేడు
గూడ గలదని గుర్తుంచుకొనుము తచ్చ
రమ్మెదురుచూచు శత్రుశేషమ్ము కొరకు

పలుకులివి జ్ఞాపకమ్మున్న బాగ పరెద
వన్యధాయైన లక్ష్మణు నాగ్రహమ్ము
రామ బాణాగ్నికన్న క్రూరమ్ముగా ద
హించివైచును నిను క్షమియించనింక

అని మరలిపోవు సౌమిత్రి నరసి కొంత
యూరటన్ జెంది సుగ్రీవుడా రఘూద్వ
హునకు సేవ యొనర్చెదననుచు, నుత్స
హించి కపి గణమ్ములను రప్పించెనపుడు

మనకు సాయమ్ము సలిపిన మాన్యుడైన
రామభద్రుని భార్య వార్తలను తెలిపి
తెలియజేయగ వలయు నిత్తెరగు మనకు
బాధ్యతయు ధర్మమనియె నిబ్బరముజూపి

మనమిది యొనర్పకున్నచో కనలగలము
లక్ష్మణుని కోపవహ్ని నాలస్యమేల
సర్వ దిక్కులకెల్లరు సాగిపోయి
సీతకొఱకై ప్రయత్నమ్ము సేయవలయు

కీశపతి వాక్యముల నాలకించినట్టి
వానరులు వేరువేరైన వర్గములుగ
నిలిచి నలుదిక్కులకు జనదలచినారు
సముచితోత్సాహ సంభ్రమాశ్చర్య గతుల

అంగదుడు, జాంబవంతుడు, హనుమంతాదు
లయిన వీరులు దక్షిణమ్మందు వెదుక
సాగిపోయిరి భక్తి విశ్వాసమలర
పరులితర దిక్కులకుబోవ పయనమవగ

పయనమైపోవ సంసిద్ధ పడినయట్టి
సర్వ వానరసైన్యమ్ము జలధివోలె
ఘూర్ణిలగసాగె బ్రతుకుపై గూడ తీపి
మరచి విశ్వాసపాత్రులై మనసునిలిపి

వారి గని దాశరథి మనోభావ మలరె
సీత వృత్తాంతమంతయు చేరినట్లె
పొంగె హృదయమ్ము కపుల - అపూర్వ భక్తి
భావమున కూగె తనువెల్ల భద్రతగని

వారిలో దక్షిణపు దిక్కువంక జనెడి -
ఆంజనేయుని బిలిచి నీ వరయగలవు
నిక్కముగ సీత విషయమ్ము, పెక్కులేల
పోయిరావయ్య శుభముల పొందిరమ్ము

నీవు జానకిన్ గన్న పున్నెంపువేళ
అస్మదీయుడవని సీత యాదరింప
నమ్మకముగూర్చు నీ - ఉంగరమ్ము గొనుమ
హనుమ యని ప్రేమతో రాముడందజేసె

దోసిటన్ బట్టి కన్నులుమూసి మ్రొక్కి
శిరము నందిడి మారుతి పరమభక్తి
తోడనట్లగుగాక నావాడవైన
నీ దయాలేశమున్న నన్నియును జరుగు

అనుచు శ్రీరామదేవు పాదాంబుజముల
నంటి - ఆనందమున మున్గియాడదొడగె
హనుమ తానప్పుడే సీత నరసినట్లు
మెప్పుగని రామునికి దాసిజెప్పినట్లు

రాముడాశీర్వదించె నెల్లరును వారు
కదలిపోయిరి ఋష్యమూకమ్ము వదలి
ఎవ్వరే దిక్కునకు నిర్ణయింపబడిరో
వారలాదిక్కునకు భక్తిభావ మలర

తన విధిని దీర్చుకొన్న లక్ష్మణుడు రామ
చంద్రు చరణాలచెంగట సాగిలబడి
స్వామి - అమ్మకు శుభమగు జయము మీకు
దాసుడను సత్యమీమాట తథ్యమయ్య

అనుచు ప్రార్థించె రాఘవుడాలకించె
కాలమయ్యది మెల్లగ గడుచుచుండె
క్రొత్తదనమున మెరయు శరత్తునందు
సాగె నల్దిక్కులకు కపి సైన్యమపుడు

దక్షిణపు దిక్కునకు గోరి తరలినట్టి
వారుగాక నితరులైన వారలెల్ల
మరలివచ్చిరి వెళ్ళిన మార్గమందె
నీరసము నిస్పృహాయు మదినిండుకొనగ

దక్షిణమ్మున కరిగిన దక్షులైన
జాంబవంతాదులెల్లరు సాహసమ్ము
దీక్ష విడకయె కఠిన పరీక్షకాగి
నడుచుచుండిరి ముందుకానందముగను

కొంత దవ్వరిగిన వెన్క కోతిమూక
దాహబాధకు గురియౌచు తట్టుకొనగ
లేక - అల్లాడిపోయె నాలికలుజాపి
డొక్కలాడించు కొనుచును దిక్కు గనక

వారికిన్ దాపులోన కన్పడియె నొక్క
కొండబిలమట పక్షులు గుంపుగట్టి
గగనమున నాడుచున్నవి గాననచట
జలములుండుననటంచు నాశను వహించి

సాగెనచటికి వనచర సంఘమెల్ల
దేహబాధను పోగొట్టదలచుకొనుచు
కాని జలములనట వారు గాంచరైరి
కాంతి పుంజములచ్చట కానబడియె

కాంతి బిలసీమ నుండియే కదలివచ్చు
చున్న యదిగాన యిచ్చటనుండి రెవరో
అని కపులు శంకగల వారలగుచు బిలము
లోనికిన్ జేరి కనుగొన బూనిరపుడు

కపులు బిలమధ్యమునకు నుత్కంఠతోడ
నరిగి కన్నులలోన నత్యంత విస్మ
యమ్ము పెంపొందగన్, మహైశ్వర్య మొదవ,
గాంచిరచట స్వయంప్రభన్ కనకవల్లి

ఆమె కనుగొనినంత భయమ్ము నంది
కపులు మనవి యొనర్చిరి కరము లెత్తి
అమ్మ మాయెడ ద్రోహభావమ్ము లేదు
దప్పిగొని వచ్చినార మీ దారివెంట

ఆమెయును వారిమాటల నాలకించి
పలికె నీరీతి వారితో భ్రాంతివదలి
ఒంటరిగ నీవు బిలమునందుండువేళ
కపులు వత్తురు కొందరిక్కడకు - వారు

వచ్చి వెడలిన పిమ్మట వచ్చితీరు
రామచంద్రుండు నీకు దర్శనమొసంగ
బ్రహ్మ వరమిచ్చె నాకిట్లు - వచ్చినారు
రాముడిక వచ్చునిటుకు వరమ్మువలన

అమ్మ! - ఆనంద మొదవె - ఓ అన్నలార
మీరలీ ఫలములుగొని - ఆరగించి
దప్పికన్ దీర్చుకొనుడు నే ధన్యనగుదు
మీ శుభాగమనమ్మది మేలు నాకు

కపులు ముదమున నామె వాక్యములు వినుచు
నామె - ఆతిథ్యమునుగొని - అలసటను శ
మింపగా జేసికొని - ఆలసింపకపుడు
తమ కథన్ విశపించి రత్తన్వికపుడు

సర్వము శుభంబగును మీకు సంతసమ్ము
కలుగు నాకని పలికి - అక్కపులగాంచి
మీరు వెంటనే సాగరతీరమునకు
కనులుమూసిన చేరగాగలుగుదురనె

వారు కన్నులుమూసి - పారమైన
జలధియొడ్డున నిల్చిరా క్షణమునందె
ఆయమ మహాత్త్వరంబైన యట్టిశక్తి
కబ్బురమ్మొంది మనసు తబ్బిబ్బ చెంద

ఆమె దయజూపి మనకు సాయమ్మొనర్ప
చేరుకొంటిమి సాగర తీరమునకు
మించె సమయమ్ము గడువేమొ మిగులదాయె
అమ్మజాడ నొకింతయు నరయలేక

మార్గమె - అగమ్యమైయుండె మనము సీత
నెపుడు గాంతుము? ప్రభువున కెపుడు వార్త
నందజేతుము? లేక నయ్యధిపు నాగ్ర
హమ్మునకు గురియౌదుమో! యనుచు వారు

కుమిలిపోవుచు మాట్లాడుకొనెడి వారి
పలుకులన్నియు బడియె సంపాతి చెవుల
వారి పలుకులలో తన భ్రాత దివికి
నరిగెననుమాట హృదయమ్ము నవలజేసె

ఎవ్వరిచ్చట నగ్రజుడిహము వీడె
ననుచు పలుకుచున్నారు కినుక గలుగ
మిమ్ము క్షమియింపనని ఆగ్రహమ్ము తోడ
పలికె వారలజూచి సంపాతి యపుడు

అవును నిజమిది రావణుడవనిజను దు
రాక్రమణ సల్పి గొనిపోవునట్టివేళ
సాహసమ్మున నెదిరించి సాయపడగ
మత్తచిత్తు నెదిర్చియు మడసెనతఁడు

వారి మాటలు వినుచును మీరలిటకు
వచ్చినారెందులకని సంపాతియనియె
ధరణి సుతనెత్తుకొనిపోవు దానవుండు
పయన మొనరించె నిక్కమీ బాటవెంట

కాని యాతని నెదిరింప మానసమున
నూహ గలిగియు రెక్కలకున్న శక్తి
చాలమిన్ జేసి యెట్టి యాచరణ కేని
పూనుకొన జాలనైతిని - పూర్వమినుని

తోడ పోటీకి నిలచిన వాడనగుట
భాస్కరుని యుగ్రతేజమ్ము పాలబడిన
పక్షములు తొంటిశక్తి కోల్పడిన కతన
నిష్క్రియాచరణుండనై నిల్చినాడ

చాలుచాలు వాడేగినజాడ మాకు
తెలిపినాడవు పుణ్యమ్ము సలిపినట్లె
గమ్యమె - అగమ్యమైయున్న కారణమున
నీ పలుకు మాకు కలిగించె నిబ్బరమ్ము

కొంతకాలమ్ము గడచిన కాంతవెదుక
దాశరధిపంపు దూతల దర్శనమున
క్రొత్త సత్తువ మరల రేకెత్తు పక్ష
ములకు నీకని యొక మహాముని వచించె

నాటినుండియు శ్రీరామనామ చింత
నమ్ము సలుపుచు బ్రతికియున్నాడనిట్లె
మిమ్ము దర్శింపగ పరాక్రమమ్ము పెరిగె
పక్షములయందు సత్తువ ప్రబలమాయె

నేను మీవెంటనే జలనిధి వరకును
వచ్చి సద్భక్తి మీర నా భ్రాతకిప్డు
తర్పణ మొనర్చుకొందు తిలాంజలులను
పిదప కర్తవ్యమేమొ చెప్పెదను మీకు

అనుచు సంపాతియనగ వారనుమతించి
చేరుకొనిరెల్లరు పయోధి తీరమునకు
అంత సంపాతి తనపనియైన వెనుక
కపులగని పల్కె కార్యదీక్షను వహించి

వానరోత్తములార యీ వార్ధి యోజ
న శత పరిమితి కలిగియున్నది నిజమ్ము
మీరు దక్షులు తరియించు వారలెవరొ
త్వరగ యోచించుడయ్య సోత్సాహులగుచు

వానరులు జాంబవంతుని వంక జూచి
మాకు నీవింక దిక్కు భల్లూకరాజ
పెద్దవాడవు జలధిని పేర్మి దాటి
లంకకున్ జేరి సీత వార్తను గ్రహింప

సాగరోల్లంఘనమున కశక్తుడను, వ
చించుచున్నాడ సత్యము చేవదరిగి
యున్న నాపయి నీ కార్యముంచదగదు
వేరొకరి నీపనికి జూడ వేడుకొందు

వరుసగా వానరులు వారివారి బలము
లింతయని - ఊహసల్పి వచించినారు
నూరు యోజనముల దాటనేర రెవ్వ
రొక్కరునుగూడ వారిలో నిక్కమిదియె!

"ఔర! యిక సీతజాడ నెట్లరయగలము
ప్రభువునకు తృప్తినెట్లు గూర్పంగగలము
రామచంద్రుని మెప్పించి ప్రేమపూర్వ
కమ్ములగు దీవెనలనెట్లు గాంచగలము

ఏను శతయోజనములైన నేగగలను
తిరిగివచ్చెడి వివరమ్ము తెలియనేర"
ననుచు పలికెడి - అంగదు నరసి జాంబ
వంతుడరిగె సహా హనుమంతు కడకు

దూరమున నొక్కడేయుండి సారమధుర
రామనామమ్ము జపియించు రక్తిగలిగి
పరవశత నొందుచున్నట్టి పావనిగని
తాత యిట్లనె - ఆ రామదూతతోడ

ఆంజనేయ వానరులెల్ల నబ్ధిదాట
జూపి నారలశక్తత భూపతికిని
రఘుపతికిని సంతోషమేర్పడు విధాన
కపులు సలుపంగ దగినట్టి కార్యమిదియె

వాస్తవమ్మిది యింక నీవలన రామ
కార్యమెల్లను సఫలత గాంచవలెను
సర్వశక్తియుతుండవు స్వామిభక్తి
పరుడవగు నీవె దిక్కు మా పాలికింక

నీ మహాశక్తి నెరుగవు నీవు పరులు
తెలిపినన్ గాని కావున తెలిసికొనుము
సాగరముదాటి లంకకు జని కపీంద్ర!
కార్యసఫలత గావింపగలవు నీవు

అనుక నరుదెంచినాడ నీకడకు నేను
నిజము పలికితి తావక నిరుపమాన
శక్తిని గురించి సర్వమ్ము సత్యముగను
బయలుదేరుము వెంటనే భద్రమగును

తాత వాక్యను వినుచు విస్మితుడగుచు
పలికె హనుమంతుడిట్లని ప్రభువుకొఱకు
రామదేవునికొఱకు నీ ప్రేమకొఱకు
శిరమునన్ దాల్చి నీయాజ్ఞ మరలివత్తు

మారుతి మనోజ్ఞవాణి విచారమెల్ల
నణపగా జాంబవంతుడత్యధికమైన
సంబరమ్మున వాని భుజమ్ము తట్టి
లెమ్మనుచు ప్రోత్సహించె క్షణమ్ములోన

రామ కార్యమ్ముకొఱకు పరాక్రమించు
భాగ్యమబ్బుటయే మహా భాగ్యమనుచు
తలచె పవమానసుతుడు - పాదమ్ములంటి
తాతకున్ మ్రొక్కి నవనవోత్సాహి యగుచు

తాత వాక్యమ్ము నెడలదాల్చి కపుల
వాంఛితమ్మును నెరవేర్ప వలయుననుచు
జానకీనాథునకు క్రొత్త సంబరమ్ము
గూర్పజాలెడు పని నెరవేర్పదలచి

ఆంజనేయుడుత్సాహమ్ము నతిశయింప
జేసికొనుచు సత్తువ లెక్క చేసికొనక
మేనుబెంచెను దీక్షనుబూని దూకె
రాముదలచి మహేంద్ర శైలమ్ముపైకి

ఆ మహోన్నత పర్వతసీమ నిల్చి
దృష్టి సారించె దక్షిణదిశన వెలుగు
లంక వంకకు మానసోల్లాసియగుచు
మనసు కర్తవ్యమందు నిమగ్నపరచి

సుందరమ్మైన లంకలో నందముగ న
లంకరింపబడిన సౌధరాజములను
తాను తిలకించి కపిరాజు తన్మయత్వ
మున మునిగె లంక వైభవమును దలంచి

దాశరథినే - మనమ్మునదలచి భక్తి
భావమున నొక్కయూపున పర్వతమ్ము
నుండి యెగసెను జలధిపై నురికినట్లు
మారుతిన్గని గగన సంచారులదర

కపివరునిగని కపులు దిగ్భ్రాంతి తోడ
జయజయ యటంచు కోరి ప్రశంసలిడగ
వనధియందునవి ప్రతి ధ్వనులనీన
కదలె మారుతి గగన మార్గమ్మునందు

ఆకసమ్మున విహరించునట్టి - ఆంజ
నేయు నప్రతిహతశక్తి నేలమీద
నరుగువారికి నవనవాహ్లాద మొదవ
జేయుచుండెను వివిధ విశిష్టగతుల

సాగెను విశృంఖలముగ నాశ్చర్యకరము
గాగ మారుతియాత్ర - ఆకసమునందు
యక్ష కిన్నర కింపురుషాదులెల్ల
ఆంజనేయుని సాహసమ్మరసి మురియ

వనచరుని దివ్యపాద ఘట్టనమువలన
అద్రిపైగల వృక్షమ్ములన్నియును స
భక్తికమ్మగ రాల్చె పుష్పములనెన్నొ!
అద్రిమెచ్చి - అర్పించు పుష్పాంజలివలె

తరువులిడు పుష్పవృష్టినొదల ధరించి
సాగరముపైన హనుమయుసాగె భక్తి
యుక్తభావ పరిభావ సంయుక్తుడగుచు -
కార్యదీక్ష వహించి - ఉత్కంఠతోడ



ముదమున - 'కిష్కింధను' నే
సదమలమతి పల్కినాడ సత్యము, ప్రజ్ఞా
హృదయులు పారకులెల్లరు
సదయులు మీ కృపయె నాకు శక్తి నొసంగన్!

కింకరుడను శారదకున్,
పంకేరుహనయను రామపాద ద్వయికిన్
వేంకట శేషాచార్యుడ
సంకల్పము కలిగె రామచరితము వ్రాయన్

సూత్రము వైఖానసమై
గోత్రమమ్మాత్రేయ మగుచు గూడగ, నిత్య
స్తోత్ర మొనర్చుచు రాముని
పాత్రుడనైనాడ మహిత పండిత కృపకున్!

# "ప్రమాదో........"

| పుట/పంక్తి | ఉన్నది/ఉండవలసినది |
|---|---|
| 7/6 | నను / నన్ను |
| 9/15 | నదిలో / నదికోన |
| 13/5 | ఇష్టి / ఇష్టిని |
| 14/16 | పురుషుడు / పూరుషుడు |
| 15/21 | నమి / నవమి |
| 15/22 | పునర్వ్వసు / పునర్వసు |
| 24/10 | జెప్పె / జెప్పి |
| 25/1 | పుత్రులరువది / సుతులరువది |
| 32/2 | అహల్య / మునిపత్ని |
| 32/6 | కలసిరచ్చోట / కూడిరచ్చోట |
| 34/7 | డెంతో / డలిగి, |
| 36/3 | శరము నెక్కిడ / ధను వెక్కిడ |
| 36/24 | కార్యదీక్షత / కార్యదక్షత |
| 37/23 | ధనస్సు / ధనుస్సు |
| 43/11 | గురురుల / గురువరుల |
| 45/10 | నయన / నయను |
| 47/22 | వహింప / వహియింప |
| 53/19 | వంశమునన్ / వంశమున్ |
| 54/23 | మటంచుము / మటంచును |
| 55/24 | నిజము పలుకు కే/ సత్యవచనమే |
| 59/10 | గాదలచు / గానెంచు |
| 59/22 | తో పయనమాయె / వెనువెంట వెడలె |

61/7 పొరలుచుండె / పొర్లుచుండె
63/24 కరుగుమని / కేగుమని
63/7 కొనిపోవలెను/కొనిపోవవలెను
68/23 చిటికలో / చిటికలోనె
70/17 పలుకుచున్ / పలుకుచు
72/4 సముచితోత్సాహ/సుచితోత్సాహ
73/3 పాదములు/ పాపములను
77/14 భరతుడా జరిగినదియేమొ /
జరిగినదియేమొ భరతుడా!
79/18 కడ సెలవు / కడనాజ్ఞ
81/19 తరుతాలతా / తరులతా
84/12 మరలిపోడు / మరలుడిక
84/22 నరికిరంత / త్రుంచిరంత
85/21 అచట సుతీక్షు / అట సుతీక్షుణా
86/21 తపసి / తాపసి
87/22 మొనర్పు / మొనర్చు
90/6 సంతసమున | సంతసమ్మున
91/1 గోదావరిని / గోదావరికిని
93/8 దుర్బిద్ధి / దుర్బుద్ధి
93/12 మయి / మయిరి
96/7 వారికిని / వారికి
96/24 వైచెదన్ / వైచెద-
100/5 ఉడు వెడలి | ఉండేగ,
100/9 అరుచెంచె / అరుదెంచె
100/11 వచ్చి / వచ్చె
107/17 సంతృప్త / సంతప్త

107/22 ఖుని జూచి / ఖుని కనులజూచి

110/2 వణక సాగెను / వణకగ సాగెను

113/4 రమ్యతోడనతి / రమ్యతోడను, బహు

114/14 నపహరించె / నపహారించె

117/21 జానకిని వెదుక / సతిని వెదుకగ

119/6 ప్రకృతి / వన

123/22 వినబడియె / వినబడె

124/18 యత్నంబునకు / యత్నంబునకును,

126/16 ఇచటనే / ఇచటనె

127/9 లక్ష్మణుడు / లక్ష్మణుండు

129/2 వాలి / వాలిని

129/23 అన్నచేత / అన్నచే

132/19 నిలుపుకొనుచు / నిల్పుకొనుచు

# శ్రీమద్రామాయణ కల్పతరువు

## అక్షరాకృతికి ఆర్థికంగా సహకరించిన సుకృతాత్ములు

| | | |
|---|---|---|
| కత్తినేని రామలింగారెడ్డిగారు | పేర్నమిట్ట | 1000-00 |
| సిరిపురపు వీరయ్య చౌదరిగారు | ,, | 1000-00 |
| బలిజపల్లి కోటిరెడ్డిగారు | ,, | 500-00 |
| చలమని రామలింగారెడ్డిగారు | ,, | 500-00 |
| బలిజపల్లి రామిరెడ్డిగారు | ,, | 200-00 |
| పరాంకుశం ఆదినారాయణాచార్యులు, రాజ్యలక్ష్మమ్మల కుమారుడు రామాచార్యులుగారు | ,, | 116-00 |
| శ్రీరామ వేణుగోపాల భక్త సమాజము | ,, | 116-00 |
| చక్కా వేంకట సుబ్బయ్య కుమారుడు సుబ్బారాయుడు-భార్య తులశమ్మల జ్ఞాపకార్థం వారి కుమారుడు వేంకట సుబ్బారావుగారు | ,, | 116-00 |
| చక్కా సుబ్బరాయుడుగారి కుమారుడు యానాది శెట్టిగారు | ,, | 116-00 |
| కీ।శే। వాడ్రేవు రామకృష్ణయ్యగారు | ,, | 116-00 |
| మచ్చా నారపురెడ్డిగారు | ,, | 116-00 |
| కొత్రా సత్యనారాయణగారి కుమారుడు సీతారామయ్యగారు | ,, | 58-00 |
| సంగుభట్లు కృష్ణమూర్తిగారు | ,, | 58-00 |
| కారంసెట్టి సీతారామయ్యగారి కుమారుడు సుబ్బారావుగారు | ,, | 58-00 |
| బత్తుల సత్యనారాయణగారు | నర్సాయపాలెం | 300-00 |
| నల్లూరి రాఘవయ్యగారి కుమారుడు వేంకట సుబ్బయ్యగారు | ,, | 200-00 |
| నలజర్ల వెంకట్రావుగారు | ,, | 116-00 |

కీ॥ శే॥ తూమాటి కోటయ్యగారి భార్య

గోవిందమ్మగారు ,, 116-00

కామేపల్లి శేషయ్యగారు ,, 100-00

పోలవరపు ఆదెయ్య, గోవిందమ్మగార్ల మనుమడు

రాఘవస్వామిగారు ,, 100-00

నారాయణం శ్రీనివాసాచార్యులుగారి కుమారుడు

సత్యనారాయణాచార్యులుగారు తిరుపతి 500-00

ఆదిరెడ్డి వేంకటేశ్వర్లుగారు నాంచారెడ్డిపాలెం 58-00

చంద్రపాటి సుబ్బారావుగారి కుమారుడు

శ్రీనివాసరావుగారు చంద్రపాడు 100-00

పరాంకుశం చక్రాచార్యులగారి కుమారుడు

కేశవాచార్యులుగారు పొందూరు 116-00

పరాంకుశం వేంకటశేషాచార్యులుగారు గురవారెడ్డిపాలెం 116-00

గాదంసెట్టి ఆదినారాయణగారు ఒంగోలు 150-00

నారాయణం శేషాచార్యులుగారి కుమారుడు

వేంకటాచార్యులుగారు ,, 116-00

కొత్తా శ్రీరాములు, ఆండాళ్ళమ్మగార్ల

జ్ఞాపకార్థం శ్రీనివాసులుగారు ,, 100-00

నల్లూరి కృష్ణయ్యగారి కుమారుడు

పిచ్చయ్యగారు మారెళ్ళ గుంటపాలెం 200-00

నల్లూరి రామస్వామిగారి కుమారుడు

పిచ్చయ్యగారు ,, 116-00

నారాయణం సత్యనారాయణాచార్యులుగారు పొదిలి 116-00

సర్వశ్రీ N.V.G. కృష్ణమూర్తి ద్వారా నిజామాబాదు

**విద్యుత్ బోర్డు శాఖ ఉద్యోగులు 1908/-**

## అప్పాపురం గ్రామస్తులు

| | |
|---|---|
| అత్తోటి హనుమయ్యగారు | 116-00 |
| అత్తోటి సింగయ్యగారు | 116-00 |
| అత్తోటి శరభయ్యగారు | 116-00 |
| కొల్లా వీరయ్యగారు | 116-00 |
| ఆరె సోమయ్యగారు | 116-00 |
| నూతి నాగేశ్వరరావుగారు | 116-00 |
| నారాయణం సూర్య నారాయణాచార్యులుగారు | 116-00 |
| డా॥ యన్. కేశవమూర్తిగారు M.B.B.S, (బాపట్ల) | 116-00 |
| నారాయణం అనంత పద్మనాభాచార్యులుగారు (బుజ్జిబాబు) | 116-00 |
| యన్. చిట్టిబాబుగారు (తెనాలి) | 116-00 |
| పరుచూరి విజయసారథిగారు (శ్రీహరి కోట) | 116-00 |
| నూతి కాంతమ్మగారు | 100-00 |
| నూతి కోటేశ్వరరావుగారు | 100 00 |
| కొత్తమాసు రత్నాకరరావు, శ్రీనివాసరరావు సోదరులు | 100-00 |
| బొలిశెట్టి నాగేశ్వరరావుగారు | 58-00 |
| బొలిశెట్టి రామసుబ్బయ్యగారు | 58-00 |
| కొల్లా ఆదిశేషయ్యగారు | 58-00 |
| బోడపాటి సుబ్బారావుగారు | 58-00 |
| నూతి బ్రహ్మయ్యగారు | 58-00 |
| దొంతినేని శరాబందిగారు | 58-00 |
| దొంతినేని పిచ్చయ్యగారు | 58-00 |
| గాజుల రామయ్యగారు | 60-00 |
| పావులూరి సాంబశివరావుగారు | 58-00 |
| చుండూరు వేంకటేశ్వర్లుగారు | 58 00 |
| కామినేని హనుమయ్యగారు | 40-00 |
| పాతూరి ఆంజనేయులుగారు | 40-00 |

| | |
|---|---|
| కొల్లా సింగయ్యగారు | 30-00 |
| కొల్లా కోటేశ్వరరావు | 30-00 |
| మెల్లా సుబ్బారావుగారు | 30-00 |
| శింగమనేని యానాదమ్మగారు | 25-00 |
| నూతి శేషగిరిగారు | 25-00 |
| ఇతర భక్తులు | 58-00 |

## ధాన్యరూపమున యిచ్చినవారు

| | |
|---|---|
| దొంతినేని వేంకట రామయ్యగారు | 200-00 |
| కొల్లా రత్తయ్యగారు | 100-00 |
| పరిటాల పెద్దబ్బాయిగారు | 100-00 |
| డాబా సుబ్బులుగారు | 100-00 |
| నూతి రంగారావుగారు | 100-00 |
| కొల్లా వేంకటేశ్వర్లుగారు | 100-00 |
| పరిటాల నాగయ్య | 100-00 |
| మేడుకొండూరు హనుమంతరావుగారు | 100-00 |
| సాదరబోయిన వెంకయ్యగారు | 104-00 |
| పోసాని కోటయ్యగారు | 40-00 |
| పరిటాల కాళిదాసుగారు | 40-00 |
| పోసాని వీరయ్యగారు | 40-00 |
| కొల్లా హరిబాబుగారు | 40-00 |
| దొప్పలపూడి వేంకటేశ్వర్లుగారు | 40-00 |

